# టిపికల్ జోడా

శ్రీ మానాపురం అప్పారావు పట్నాయిక్.



పబ్లిషర్ :

పసుపులేటి బాపిరాజు,

రాజమండ్రి.

1944.



## సూచన.

స్వార్థంకోసం ఫలాపేక్షనాశించి ఎంతటిఘోరాలనైనా వెనుదీయకుండ కర్కశహృదయంతో నిరాఘాటంగా జరిపించగలిగే నిబ్బర మనస్కులు మనదేశంలో చాలమంది ఉన్నారు.

కాని—అట్టివారి కుటిలనటనాప్రవీణత ఎల్లకాలం సాగిరావడం దుర్భరం అని తెలియబరుస్తూ, అట్టి మాయాశీలుర భవిష్యత్ జీవితం పరాభవములతోకూడిన పరిహాస్యాలకు గురికాగలదని తెలియబర్చడమే ఈ కథయొక్క ముఖ్యోద్దేశం—

ఇహ చదవండి—

ఇట్లు
రచయిత



# 1

'బాబాయి—గుఱ్ఱంను సిద్ధంచేయమని గంగన్నకు మీరు చెప్పండి'

'ఏక్కడకమ్మా గుఱ్ఱంమీద వెళ్ళడం?'

'పల్లెటూర్ల సౌందర్యం ఆప్రక్క పొలాలమీద తోటలమీదా అధారపడి ఉంటాయనికదండీ మీరు చెపుతూంటారు. అవి చూడడానికే—'

'మః పట్నం అనుకొన్నావా తల్లీ రోడ్డు చదునుగా ఉండి చెప్పినట్లు గుఱ్ఱం పరుగెత్తడానికి'

'ఇట్లాంటి పొలంగట్లమీదే, స్వారీచేయడం తమాషాగాకూడ ఉంటుందండి. అంచేతే ఈవేళ స్పెషల్ ప్రోగ్రాం పెట్టుకొన్నాను'

'మరి నీకు సహాయం ఎవరువస్తారమ్మా తిరిగి వచ్చేప్పుడు దారి చూపడానికి'

'అక్కర్లేదండి. దారేతెలుసుకొని తిరిగి రాలేకపోతానా?—అడ్డతీగెలకు దారిఏదంటే ఎవరుపడితే వారేచెపుతారు'

'ఊ—నీయిష్టం. వెళ్లు—'

'గంగన్న గుఱ్ఱపుశాలలో గుఱ్ఱానికి మాలీసు చేస్తూన్నాడట. జీనువేసి సిద్ధంచేయమని మీరే కబురుచెయ్యండి—' అని తండ్రి గణపతిరావుగారికి అరుణ ముచ్చటగా చెపుతూంటే మేనజరు విశ్వన రావుగారు—

'వద్దమ్మా—అలావెళ్ళకూడదు. వచ్చినది క్రొత్తస్థలం. అందులో ఆడపిల్లవు. వంటరిగా—'

'నా ఉత్సాహానికి మీరు అడ్డుతగలకండి. ఇది క్రొత్తస్థలం కాబట్టే చూడడానికి బయలుదేరడం' అంది అరుణ కండ్లలో కోపాన్ని అగుపరుస్తూ.

'తప్పు అమ్మా—పెద్దవారిని అలా విదలించకూడదు. విశ్వాస రావుగారంటే నావలె నీ శ్రేయస్సుకోరువారిలో ఒకరు—'

'ఏలాఅయినా నేను వెళ్ళితీరాలి. విశ్వాసరావుగారు చెప్పారనే వాదులుతూ గంగన్న మీఅనుమతిలేనిదే గుఱ్ఱంమీద జీనువేయనన్నాడు. అంచేతనే మీదగ్గరకు వచ్చాను. నామీద అధికారం మధ్యను ఈయన కేంకావాలి—'

'అలా మాట్లాడకు తల్లీ—చిన్నదానవు. సరే—నీకు అంత సరదాగాఉంటే వెళ్ళి చీకటిపడకముందే తిరిగి వచ్చేవేయి—'

'ఆ.—సూర్యాస్తమయంగాకుండానే తిరిగివస్తాను. వాడికి కబురుచేసి—'

'నీఉడువులతో నీవు సిద్ధమయ్యేప్పటికి గుఱ్ఱం సిద్ధంగా ఉండక పోతూందా!—నువ్వు వెళ్ళమ్మా—' అని పండుమీసాలలోంచి గణపతి నవ్వుతూంటే అరుణ చలాకీగా అక్కడనుంచి పక్కగదిలోనికి పరుగెత్తింది. గణపతిరావుకండ్లను మేనజరు విశ్వాసరావువంకకు త్రిప్పుతూ

'అరుణ పెంకిపిల్ల. దానికితోచినంతే. దానిపంతం నెగ్గకపోతే పెద్దలనికూడ యోచించకుండ మాట్లాడుతుంది'

'అవును. మీప్రేమలో గారాబంగా పెరగడంచేత ఆ నియమ ములు అంతగా తెలియవు ఆ అమ్మాయికి'

'ఊ.—తల్లి చనిపోయినతరువాత నేనే తల్లినై తల్లిలేనిలోటు లేకుండ పెంచాను. ఆ ప్రేమచేతనే అరుణను గట్టిగా ఓ మాట అనలేను'

'నిజమే. కాని వయస్సు వచ్చినతరువాతమాత్రం ఆడపిల్లలు తమ అదుపు ఆజ్ఞలలో ఉండాలి. లేకుంటే—'

'విశ్వాసరావుగారూ! ఒక్కమాట. కొడుకైనా కుమార్తె అయినా అరుణ ఒక్కతే కాబట్టే ఆమెను కట్టుబాట్లనే ఖైదులో

బంధించడానికి నా మనస్సు ఒప్పుకోలేదు స్వేచ్ఛగా సకలశక్తులతోటి నాకండ్లఎదుట సంతోషముతో తిరుగడమే నాకు కావాలి’

‘కాదనను నేను. కావచ్చును. కాని—తెలియని ప్రదేశాలలో నిస్సహాయంగా ఆమె తిరుగడంగురించి మంచిదికాదనిమాత్రమే నా ఉద్దేశం’

‘ఫరవాలేదు. అరుణ అంత తెలివితక్కువదికాదు. ఆత్మ గౌరవంఎరిగి నడుచుకొనే ఆధునికవిద్యావతి మన అరుణ’

‘ఔను. ఆమె ప్రతివాదనా నన్ను తృప్తిపరుస్తుంది. ఇట్టి స్వేచ్ఛావాదనగల బాలిక మన అరుణ అని తెలుసు కాబట్టే వాసు కూడ ఆమెను విడువకుండ తిరుగుతూండేవాడు. మదరాసునుంచి వ్రాసే వాడి ప్రతిఉత్తరంలోనూ అరుణసంగతి అడగడం మరువనే మరువడు’

‘అవును. వాసుకి అరుణమాటలంటే చాల యిష్టం. అరుణ అలిగి అతనితో మాట్లాడకపోయిందంటే దిగాలుపడి మళ్ళీ ఆమె మాట్లాడుతుంది—’

‘వాడక్కడనుంచి చదువుతూన్నాడన్నమాటే గాని వాడి ప్రాణ మంతా అరుణమీదనే ఉంటుంది’

‘నాకు తెలుసు వాసుకి అరుణఅంటే ఎంతప్రేమో’

‘పరీక్షలు కావడంతోనే వస్తానని వ్రాశాడు నిన్ననే’

‘పరీక్షలు ఎప్పటినుంచి మొదలు?’

‘ఇప్పుడు జరుగుతూనేఉన్నాయట వ్రాసిన సబ్జక్టునుబట్టి క్లాస్ వస్తుందనే ధీమాగాకూడ ఉందని వ్రాశాడు’

‘రావచ్చు. ఫస్టుక్లాస్ అతనిని ఆహ్వానించుకొని మరీవస్తుంది. సరస్వతీదేవి యనుంగుపుత్రుడు వాసు. అతని చిన్నప్పటి చదువులోని శ్రద్ధ, నేర్పు, నాకు పూర్తిగా తెలుసును. కాబట్టే అతనియందు నా కంత గురి’

'వాడి తెలివితేటలకు కన్నతలిదండ్రులే ఉంటే ఎంత ఆనందపడి ఉప్పొంగిపోయేవారో!'

'అతనికి తలిదండ్రులు లేనిలోటు మీరు మాత్రం ఏమిచేశారు. సాయశక్తులా కష్టపడి, కట్టుదిట్టంగా చదివించి—'

'మీసహాయంకూడ అందుకు తోడ్పడకపోతే నేనా పని చేయ గలనంటారా?'

'అదంతా దైవసహాయం. మధ్య మనసహాయం ఏముంది!'

'మీఆశీర్వాదంవల్లనే వాసు అంతవాడయ్యాడని వాడి అత్త కూడ పలుమారు నాతో అంటూ మీఉన్నతహృదయాన్ని శ్లాఘి స్తూంటుంది'

'విశ్వాసరావుగారూ!—నాకు ఒక్కకోరిక ఉంది. అది ఏమం టారా?—అరుణను ఎవరికోయిచ్చి పెండ్లిచేసి అత్తవారియింటికి పంపడం నాకిష్టంలేదు—'

'ఆమె దగ్గరలేకుండ ఒక్కనిమిషంకూడ మీరు గడపలేరని కూడ నాకు తెలుసు'

'అవును. అందుచేతనే ఒక విద్యావంతునికి మన అమ్మాయిని యిచ్చి కట్టబెట్టి, ఆతనిని మనయింటనే ఉంచుకొని నాతరువాత యిస్టేటు అంతా ఆతనికే చెందేలా పవరునామా వ్రాయదలచాను'

'చిత్తం. మనకు పూర్తిగా తెలిసి, మన అదవు ఆజ్ఞలతో జాగ్రత్తగా ఉండే విద్యార్థికే అమ్మాయిని యిచ్చి పరిణయంచేయడం శ్రేయస్కరం అని నా సలహా'

'నాకు తెలుసు. ఆవ్యక్తి నామనసులో ఎప్పుడో చిత్రించబడే ఉన్నాడు'

'అమ్మాయికికూడ తెలుసా ఆ అబ్బాయిని'

'పిచ్చివాడా!—ఎన్నిమార్లు సూచాయగా నాప్రేమను వెడలిబుచ్చలేదు నాసుపట్ల. ఆతడే అరుణకు తగినవాడని నామనసులో తలచినప్పటినుంచి ఆతనియందు ప్రత్యేకదృష్టినిలిపి ఆతని యోగ క్షేమాలు అడిగి తెలుసుకోవడంలేదూ !'

'నేను గ్రహించాను. కాని పూర్తిగా మీరు పేరు ఉచ్చరించని కారణంచేత నామనసును ఆ ఆశనుంచి మరల్చ ప్రయత్నించేవాడిని. కాని యిప్పటి మీమాట నన్ను స్వర్గానికి ఎత్తివేట్టయింది. నామేనల్లుడు మీకు అల్లుడుకాబోతూన్నాడు అంటే అంతకంటె అధికసంతసం నాకేమి కావాలి!—మీసేవయే కాకుండ మీతో బంధుత్వంకూడ ప్రసాదించి నందుకు అభాగవంతునికి—' అని విడవకుండ లెక్చరుకొడుతూంటే గణపతి రావు ఆతని బుజాన్నితట్టుతూ అక్కడనుంచిలేచి నవ్వుతో తోటవైపు నడచాడు. విశ్వాసరావుకూడ ఆయనను అనుసరిస్తూ అక్కడనుంచి లేచాడు.

గణపతిరావుగారు చిన్నయిస్టేటుకు జమీందారు. ఆయనకు సాలు నామా రాబడి పదివేలకు పైబడేఉంటుంది. ఆయనకు అరుణ ఒక్కతే కుమార్తె అవడంచేత ఆతని ప్రాణాలన్నీ ఆమెను అతుక్కొనేఉంటాయి. అరుణనువిడచి ఒక్కక్షణం ఉండలేడు. అందులోనూ ఆయనభార్య అరుణకు ఐదవసంవత్సరం ప్రవేశించిన రెండవనెలలోనే గతించడంచేత మాతృవిహీనఅయిన ఆ పాపను తన కండ్లలోపెట్టుకొని పెంచారు పతి గారు. ఇప్పుడు అరుణవయసు పదునెనిమిది. స్కూలుఫైనల్ వరకు చదివి పబ్లిక్ఎగ్జామినేషనులో తప్పడంచేత చదువుకు స్వస్తిచెప్పింది. చిన్న ప్పటినుంచి ముద్దుగాపెరగడంచేత అరుణకు ఎవరివద్ద ఏలానడుచుకో వాలో తెలియనిముగ్ధగా ఉన్నప్పటికీ తనమాటనే నెగ్గించుకోవాలనే వెర్రివానవలనుతో పట్టుదలనుకలిగి యుండేది.

ఎదుటవాళ్ళ హృదయాల్ని ఉడికెత్తించి ఉత్సాహాన్ని రేకెత్తించే ఆమె పెద్దకండ్లు—పమిటలోయిమడక ఎత్తునుంచి వంపులుతిరిగే యౌవన భారమూ—లేతగులాబిరేకులచిరవనుబోలు రంగువంటి శరీరకాంతి—చుట్టూ కాంతులు మెరసే డిజయినుల జరీ నక్కీ అంచులచీరల నూతన వస్త్రధారణలూ అరుణ సాహజసౌందర్యాన్ని ద్విగిణీకృతపరచి స్వర్గభూమినుంచి దిగిన దేవకాంతలా అగుపర్చేది.

అరుణ ఆదినం గుఱ్ఱంస్వారీచేయడానికి ఫుల్ బ్లాక్ సురానాతోనూ, లోనగాయిమడ్చబడిన సన్నచారల కాలరుషర్టుతోనూ, వెడల్పాటి పట్కాబెల్టుతోనుండి పిరుదలవరకు అంటిపెట్టుకొని రెండువైపులా ఎత్తు నుంచి క్రిందికి ఏటవాలుగావచ్చే కాలరుగోటుతోనూ, మోకాలు అంచులనుతాకే నల్లబూటుతోనూ, కొరడాచివరి త్రాడును చేతిపిడి అల్లికహేండిలుకిచేర్చి ఎడమచేతితో పట్టుకొని గుఱ్ఱానికితగిన రౌతులా అగుపడే ఠీకరేసుతో గుఱ్ఱపుశాలకు టకటక నడచిపోయింది.

గణపతిరావుగారి అనుమతిమీద గంగన్న గుఱ్ఱాన్ని జీనుతో సిద్ధంచేసి అరుణకు వప్పగించాడు. అరుణ గుఱ్ఱంమీద పొజిషనులో సర్దుకుకూర్చొని ఫుట్ రెస్టులో తనపాదాలను అమర్చుకొని గుఱ్ఱాన్ని రైన్సులాగి అదలించింది. గుఱ్ఱం తాళంవేసినట్లు 'ట్లక్, ట్లక్' శబ్దముతో చిన్ని అంగలతో వేగాన్ని తగ్గించి పరుగెత్తుతూంది.

పొడుగ్గాపెరిగి పచ్చనిఆకులతో కెరటాలులావీచే గాలిబరువుకు తలలువంచుతూ, గుఱ్ఱంమీదుంచి వస్తూన్న అరుణకు సలాంచేసి ఆహ్వానిస్తూన్నట్లు అగుపడి ఆమెను ఉత్సాహపరచాయి అచ్చటి వరిపొలాలు. గుఱ్ఱండాట్లకు అరుణ జీనుమీద చక్కగా చిన్నజంప్‌తో ఎగిరిపడుతూ ఎదుట పైరుగాలికిఎగిరే తన ముంగురులను మునివేళ్ళతో సర్దుకొంటూన్న ఆమె ప్రకృతిసౌందర్యదేవతలా పచ్చనిపొలాలమధ్య బాటల్ని పట్టి పోతూంది. వరివెన్నులను ముక్కుతో ఎంది స్వేచ్ఛగా ఆరగించడానికి

వచ్చే పక్షిసమూహాలను అదలించి తరమడానికి వడిసాలలో వేచియుండే కాపుపిల్లలకు చేనులమధ్య గుట్టంమీదనుంచి యిరుప్రక్కలా తలనుత్రిప్పి చూస్తూ గాలిని చీల్చుకొని పోతూన్న అరుణ వారిదృష్టుల నమాంతంగా ఆకర్షించుకొనగలిగింది.

అరుణ మామిడితోటకంచెదగ్గర గుఱ్ఱాన్నిదిగి, తోటఫెన్సింగ్ మధ్య కట్టబడిన ఎదురుగేటు తలుపునుతెరస్తూ గుఱ్ఱంనోటిదగ్గరి కళ్ళాన్ని ఎడమచేతితో పట్టుకొని లోనికిలాగికొని పోయింది. ఆతోటలోని మామిడి గుత్తెలు అరుణను పిలుస్తూన్నట్టుగా ఆకులమధ్యనుంచి ఆమెను తొంగి చూస్తూన్నాయి. పచ్చికను మేయడానికి గుఱ్ఱాన్ని కట్టకయే తోటలో విడచిపెట్టి ఉషారుగా తోటమధ్యకు నడచిపోయింది అరుణ.

అరుణ చెట్లచివర్లను పెద్దకండ్లకదలికతో చూస్తూ ముందుకు చొరుచుకొని పోతూంటే వెనుక నోవాచెట్టుమీది కోవెల 'కూ—కూ' అని కూయడం తనతో ఆటకు ఆమెను రమ్మనిపిలచినట్టయింది. ఆపిలుపుతో చట్టున వెనుతిరిగి మామిడిచిగుళ్ళను చవిస్తూన్న కోవెలను చూడడంతో అమె ఆదిశకు పరుగెత్తి క్రిందిగావంగియున్న చెట్టుకొమ్మలసహాయంతో పైకిఎక్కింది. ఆమె కోవెలఉన్న కొమ్మమీదకు కాలువేయడంతో అది బెదరి తుర్రున ఎగిరి కనబడకుండపోయింది అరుణ నవ్వుతూ మెడను త్రిప్పి కనుమేరదూరంవరకు ఆకోవెలనుచూస్తూ ఆకొమ్మమీదనే కూర్చుండిపోయింది. ప్రక్కకొమ్మల్ని బలంగాపట్టుకొంటూ, వంగి దూరంగాఉన్న పెద్దమామిడికాయలను కోసి, కొరుకుతూ పుఱుపుఱు కండ్లుమోసుకొని ముహంకూడికతో వాటిని పూర్తిచేసింది. కాయలజీడి నాలుకకు పట్టడంచేత దురదను తాళుకోలేక ఆమె తన నాలుకను కర్చీఫ్‌తో తుడుచుకోవడంలో నిమగ్నఅయింది అంతలో పెద్ద కొండ ముచ్చు ఒకటి తన పెద్దతోకను పైకిఎత్తుతూ ప్రక్కచెట్టుమీదనుంచి ఆమె కూర్చున్న కొమ్మవైపుకకు దూకింది. అరుణ నాలుకతుడుచుకోవడంలో

ఆకోతిని గుర్తించనేలేదు. మనిషంతఎత్తుతో ఆకోతి ఆకొమ్మమీదనే మర్రిఊడలా తోకను క్రిందికి వ్రేలాడిస్తూ కూర్చొని, కొమ్మమీద ఆమెను ఓక్షణం తీవ్రంగాచూచి భయంకరంగా కిచకిచలాడింది. అరుణ అదరిపడుతూ వెనుకకుచూచింది. ముందునకు ముహాంవంచి నల్లని ముహాంతో తనకండ్లలోనికి చూస్తూన్న ఆకోతి వికృతాకారానికి ఆమె హడలుతూ తప్పించుకొనుమార్గంలేక కెవ్వని కేకవేసింది. ఆకేకకు కోతి కూడ దద్దరిల్లి ఆమె తన్నుఏమిచేయబోతుందో అన్న దిగులుతో అది మరింత కిచకిచలాడుతూ ఆమెను ఎదుర్కొనడానికి సిద్ధంగా ముందు కాళ్ళను ముందరికిజరిపి డీకొనే పొట్టేలుపోజులో కూర్చుంది. దాని గమనమునకు అరుణకండ్లలో భీతినిఅగుపరుస్తూ వెనుకకుజరిగి మరల అరచింది. అడవిలోని హరిణం అరచినట్లు. అంతలోనే కొమ్మకదలి ఎవరోమనిషి వస్తూన్నచప్పుడైయింది. ఆమె బెదరుతూ కండ్లచివర్లనుంచి వెనుకకు చూడబోతూండగనే ఒకవ్యక్తి ఆమెను తప్పించుకొంటూ ఆమెకు ముందుగావచ్చి నిలచాడు. పులినోటిలోనుంచి రక్షింపబడినట్లుగా తెమ్మరిల్లి తనముందు నిలచిన ఆతని అంగీని బిగుసుకొన్న వ్రేళ్ళతో పట్టుకొని ఆతని కాళ్ళనందునుంచి డీకొనరాబోతూన్న కోతిని చూస్తోంది. ఎదుట నిలచిన ఆవ్యక్తి ఒకటి, రెండు రొబ్బల్ని విరచి దానిమీదకు విసరుతూ నెమ్మదిగా దానిని అక్కడనుంచే బెదరించాడు. కోతి కదిలకుండ ఓనిమిషం ఆతనివంక చూచింది. ఆతడుకూడ దానిని ఏమిఅనకుండ ఓనిమిషం నిశ్శబ్దంగా ఊరుకొన్నాడు. ఆ కొండముచ్చి తన తలను యిటునటు రెండుమారులు త్రిప్పి ఒక్కఊపుతో ప్రక్కచెట్టుమీదికి చెంగున గెంతింది. అప్పటితో ఆమెలోనుంచి ఎగసిపోయిన ప్రాణాలు ఆమెలోచేరుకొని కొంత మనశ్శాంతిని కలిగించింది.

నిలువబడియున్నవ్యక్తి నెమ్మదిగా ఆమెవైపు తిరిగాడు. మగదుస్తులతో సహితం యవ్వనబిగిని వంపులనిగనిగలతో క్రొత్తపద్ధతిని అగు

పరుపచేసే ఆమె నాగరికతాసౌందర్యానికి అతని కన్నులు మూర్ఛిలు పోయాయి. అతనికండ్లకు ఎదురుగా ఆమె గట్టిరొమ్ము భయంతో కూడిన ఆయాసంతో లేచిపడుతున్నప్పటి దృశ్యం అతనిలోని రక్తాన్ని ఉదుకెత్తించి పరవళ్లుతొక్కించింది. ఏ విచారం ఎరుగక ఆటంకరహితంగా స్వేచ్ఛనుకూడ దీసుకొని ఎదిగిన ఆమెశరీరయౌవనబిగి అతనిలోని అన్నిశక్తులను పాశాలవలెలాక్కొని అతనిలో తెలియని ఆవేశాన్ని లేవదీసింది. కళ్ళను శుభ్రమింపచేసే ఆమెసౌందర్యానికి ముగ్ధుడై ఆనూతన వ్యక్తి ఆమెతోమాట్లాడ ఓనిమిషం సంకోచించి ఊరుకొన్నాడు. అరుణ అతనివంక తన విశాలనేత్రాలనువిచ్చి కంటిచివరనుంచి చూచి ముహం తిప్పుకొంది.

'క్రిందకు దిగురాతా?—'

'నాకాళ్ళు వణకుతూన్నాయి. పట్టులుతప్పి పడతానేమో అన్న భయంగాఉంది—'

'రండి. ఫరవాలేదు. నాచేతినిపట్టుకొని నెమ్మదిగా దిగండి'

'మీరుకూడ నాచేతిని పట్టుకోండి—' అంటూ అరుణ తనచేతిని అతనికి అందిస్తూ. ఒకరిచేతిని ఒకరు పట్టుకొని నెమ్మదిగా క్రిందికిదిగారు.

'థెంక్సు—ఆపదలో రక్షించారు'

'మీరక్షణకోసం నన్నుపంపిన నా అదృష్టదేవతకే మీథెంక్సు అందాలి'

'మీరు ఎవరు!—ఈతోటమీదేనా?—'

'అవును'

'మీనివాసంకూడ యిక్కడనేనా?—'

'కాదు. ఇక్కడికి అరమైలుదూరంలోఉన్న ఆనందపురం మాది'

'ఇక్కడనే ఉంటుంటారా మీరు'

'నా భోజనం ముగించుకొని పగలుమాత్రం యిక్కడనేఉంటాను. పగలంతా పరిక్షస్టడీస్‌లో—'

'చదువుతూన్నారా మీరు?'

'ఆ ఫోర్తుయియర్ ఈమార్చితో పూర్తిఅవుతుంది'

'ఈచుట్టుపట్ల కాలేజీలుఉన్న పట్నాలున్నాయా?—'

'లేవు కాబట్టే గుంటూరులో చదువుతూన్నాను'

'ఐతే—మాఊరికి దగ్గరలోనే ఉన్నారన్నమాట మీరు'

'ఏఊరు మీది'

'గుంటూరుకి పదునాల్గుమైళ్ళదూరములోఉన్న ఆత్రేయపురం'

'ఇలా ఎందుకువచ్చారు మీరు'

'పల్లెటూర్ల శోభనుచూచి సంతసపడడానికి గుఱ్ఱంమీద బయలు దేరి వస్తూ కోతితో కొట్లాట పెట్టుకొన్నాను—' అంది అరుణ చిన్న నవ్వుతో. సిగ్గుతో తలవంచి నవ్వుతూన్న ఆమెనవ్వులో తననవ్వునుకూడ కలిపాడు ఆపురుషవ్యక్తి. ఇద్దరిమధ్య రెండునిమిషములు నిశ్శబ్దం ఏర్పడింది. ఆమెను తిరుగమాట్లాడించి ఆమె కంఠమాధుర్యం అనుభ వించడానికి ప్రశ్నలకోసం వెతుకుతూంది అతని మనసు.

ఆమె నల్లనిపుల్‌సూటు రైడింగుబూట్‌తో అతని ముందు పొట్టిగా స్వాధీనపడిన అదృష్టదేవతలా అగుపడుతూంటే అతని శరీర మంతా క్రొత్తవేడితో ముచ్చెమటలు పోశాయి.

'కూర్చోండి వెళుదురుగాని—'

'వెడతాను. సాయంత్రంకావచ్చింది'

'ఎక్కడికివెళ్ళాలి మీరిప్పుడు'

'అడ్డతీగెలు అక్కడనే మానాన్నగారి కేంపు. ఏర్పరచుకొన్నారు'

'ఈతోటలోనిపండ్లు రెండు ఆరగించి—'

'క్షమించండి. రేపువచ్చినప్పుడు తప్పక తీసుకొంటాను'

'మీసహాయంగా అక్కడవరకు రమ్మంటారా?—' అన్నాడు ఆశగా.

'ఉహూ—గుఱ్ఱంమీదపోతే మీసహాయం ఎందుకు. కోతి నుంచి రక్షించి సహాయంచేశారు చాలు' అంది క్రిందిగాచూచి కొర డాను నేలకురాస్తూ.

అతని తియ్యనిమాటలలోని మార్ధవం—ఆశతో మిళితమై వణుకుతోవచ్చే అతని కంఠధ్వని ఆమెనుకూడ ఆకర్షించి ఏరోతెలియని అద్భుతమైన అతుర్రత, నరాలబాధ ఆమెను లొంగిపొమ్మని అరుస్తు న్నాయి. కోర్కెలతో పులకించే అప్పటి తనలోని మధురత అనుభ వించడం తనజీవితంలో అదే మొదటిసారి. ఏకాంతంగా ఆచెట్లమధ్య తోటలో అతనిదగ్గిరగానిలచి మాట్లాడడంతో అతనికంఠ్లు మెస్మరిజమ్‌లా ఆమెను దగ్గిరసాలాక్కుంటూన్నట్లుగా తోచింది ఆమెకు. సరిగా హృద యం యవ్వనంలో పురుషుడకోసం తెరచుకొన్న మొదటిరోజుల మధుర● అప్పుడు ఆమెకు అర్థమైంది.

'గుఱ్ఱాన్ని తీసుకొనిరానా?—'

'అది పచ్చికమేయడానికి ఎటుపోయినట్టు!—'

'మనం ఏదోమాట్లాడుకొంటూన్నాముకదా అనే తలపుతో అప్రక్కగాపోయిఉంటుంది మీగుఱ్ఱం—' అన్నాడు తమాషాగా. ఆమాటతో తన విశాలనయనాలువిచ్చి ఓమాటు సోగగా అతని కంఠ్ల లోనికి క్రొత్తచూపుల్ని ప్రసరిస్తూ ఊరుకొంది. ఆచూపులోనుంచి మన్మదర్ధరాలు ఆతనిమీద కురిసినట్టయింది.

అంతలోనే 'వేళ అతిక్రమిస్తోంది—రాపోదాం' అని జ్ఞప్తికి తెస్తూన్నట్టు గుఱ్ఱంకూడ ఆమెచేరువకు మచ్చికతోవచ్చి ఆగింది. అరుణ దాని కళ్లెములను పట్టుకొను ఫుట్‌రెస్టులో కుడికాలుమోపి గుఱ్ఱం

మీదికి ఎక్కపెట్టినట్టిస్తూంటే ఆయన ఆమె నున్నటిబుగ్గలను తన వేళ్ళతో నొక్కి పైకిలేవదీస్తూ సహాయంచేసి గుఱ్ఱాన్ని అధిష్టింప చేశాడు. అతని వేళ్ళబలం ఆమె శరీరంమీద పనిచేసి ఆమె నరాలను జలదరింపచేయడంచేత అతడు అలావిడువకుండ తాకుతూ మరో నిమిషం నిలుస్తే బాగుండుననిపించింది ఆమెకు.

'రేపు వస్తారుకదూ!—'

'ఎందుకు?—' అంది నవ్వుతూ.

'తోటలలోని ఆనందం అనుభవించి—' అని ఏమోగొణిగాడు.

'వస్తాను. పండ్లనుదాచిఉంచండి నాచే తినిపించడానికి' అంటూ ఆమె కళ్ళాన్ని లాగి అదలించి గుఱ్ఱందుంను తన జోడుకాలుతో నొక్కింది. గుఱ్ఱం అక్కడనుంచి చిన్నఅడుగులతో నాలుగుగజాలు నడచి నెమ్మదిగా పరుగునుసాగించడం మొదలెట్టింది. ఓపలుబది గజాలు పోయినతరువాత అరుణకండ్లలో మెరుపుల్ని మెరపిస్తూ, తన తెల్లని అందమైన పలువరసఅగుపడేలా ఆశతో వెనుతిరిగి గుఱ్ఱంమీదనుంచి యింగ్లీషులేడీలా చేతిని ఊపి 'ఫేర్‌వెల్' తెలిపింది. ఆమె వెనుకనే విడువక పరుగెత్తె మనసును బలంగా వెనుకకులాగుకొంటూ అచ్చటనే కదలక నిలచి ఆమె పిలుపులకు బదులుగా చేతినిమాత్రం ఊపాడు ఒకటి రెండుమారులు ఆయన.

మన పరిచయవ్యక్తి ఆనందపురంలోని రమణరావుగారి ఏకైక పుత్రుడు. వయసు యిరువదిఐదు సంవత్సరాలకులోపుగనే ఉంటాయి. రంగులో అంతఎరుపుకాకపోయినా చామనచాయగాఉండి కండ్లలోనూ ముక్కులోనూ ప్రత్యేకతనుకలిగి ఉంటాడు. అతనికి బెంగాలీవేషదారుణను అనుసరించడంలో ఆశక్తిఎక్కువ. అందుచేతనే కాలేజీకి వెళ్ళునప్పుడుకూడ పొడుగులాల్చీతోనూ, వదులుగళ్ళలాగుతోనూ ఆల్లిక

సాండిల్సుతోనూ తయారవుతూంటాడు. ముచ్చటకోసమైనా ఆతడు కోటు తొడిగినట్టు అగుపడడు ఆతనికి మురళీకృష్ణ అని తలిదండ్రులు నామకరణంచేసినా ఆ ఊరిలోనివారుమాత్రం ఆతనిని 'కృష్ణా' అని సంబోధిస్తూంటారు. ఆతడు గుంటూరులో పెద్దచదువు చదువుతూన్నాడనీ, పెద్దఉద్యోగికాబోతాడనీ ఆఊరివారు అంతా ఆతనిపట్ల ప్రత్యేక గౌరవాన్ని చూపుతూండేవారు.

గమణరావుగారు సామాన్యభూస్వామి ఆఊరులో. కొంచెం మాటకారిఅవడంచేత ఆయన తన పది ఎకరములతోపాటు మరి పది ఎకరములు కవులకు పుచ్చుకొని పాలికాపులనుపెట్టి స్వయంగా సేద్యం చేయించుకొంటూ కొద్దిమాత్రం ఆస్థి సంపాదించుకొన్నాడు. పెద్ద ఆశలుపెట్టుకొని ఆ సంపాదనలోనిడబ్బునే వెచ్చించి కృష్ణుడికి పెద్ద చదువుచెప్పించుకొన్నాడు గుంటూరులో.

కృష్ణుడు కాలేజీజీవితానికి అలవడడంచేత పట్టణవాతావరణంలో మునిగి తేలుతూ ఫేషన్సుకు అలవాటుపడినా చదువులోమాత్రం మొదటవాడిగా ఉండేవాడు. ఆతని ఎరికలో పరిక్షపోవడంఅనేది తనకు ఎన్నడూ సంభవింపకపోవడంచేత, ప్రతిపరిక్షలోనూ సులువుగా పేసవ గలననేనమ్మిక ఆతని మనసును దృఢపరచేది. ఆనమ్మికతోనే వేరు తలంపులులేక పట్టుదలగా పరిక్షలలో డిస్టింక్షన్ తెప్పించుకోవాలనే నిశ్చయంతో చదివేవాడు.

సెలవులలో ఆనందపురంవచ్చి ఏకాంతంగాకూర్చొని చదువుకొంటూండడంలోనే అరుణపరిచయం అకస్మాత్తుగా సంభవించింది ఆతనికి.

---

# 2

ఆ మరునాడు కృష్ణుడు అరుణ రాకకోసం తోటలో ఎదురు చూచాడు. కాని వరసగా మూడుదినములవరకూ ఆమెరాక అగుపడ లేదు. కస్తూరి పరిమళాలు చల్లేనోటితో, ఆచిన్నపళ్ళవరసతో తన్ను తన్మయుపరచి తర్లిపోయిన ఆయువ్వని ఎప్పుడో సుందరస్వప్నంలో వాలి ఎగిరిపోయిన సౌందర్యమూర్తిగాతలుస్తూ, ఆమెతో మాట్లాడినమాటల జ్ఞాపకంలో చెట్టుకొమ్మకు చేరబడి కండ్లుమూసేవాడు.

దూరంనుంచి అప్పుడే గుఱ్ఱండెక్కలచప్పుడు చెవిని సోకడంతోనే కృష్ణుడు చట్టున పుస్తకాన్నిమూసి సూచాయగా వినవచ్చే ఆశబ్దంవైపు చెవియొగ్గి వింటూ కొంచెంగాలేచి కూర్చున్నాడు. ఆ డెక్కలధ్వని అంతకంతకు సమీపిస్తూన్నట్టుగనే వినబడుతోంది. ఆసౌందర్యకన్య రాకయే ఆచప్పుడు అని నిశ్చయించుకొన్న అతని మనోవీధిలో సంతోషంతో మిళితమైన ఆందోళన అంకురించి, యోచనావిహీనుణ్ణిచేసి, పూర్వపు అతనితలపులు తలఎత్తకుండ చేసింది.

ఆమెను ఆహ్వానించడానికి లేస్తూండగనే అతనిముందు అరుణ గుఱ్ఱాన్ని ఆపి చలాకీగా దానిమీంచి దూకింది. కృష్ణుడు నవ్వుతూ ఆమెను సమీపించి—

'అసలు మీరు రారనుకొన్నాను'

'రాకపోయిన—నామనసుమాత్రం యిక్కడనే ఈచెట్లచుట్టూ తిరుగుతూ, తిరిగి యిక్కడికి రావడంకోసం రహస్యంగా యెంతో బాధ పడేది'

'అప్పట్లో చేజిక్కి నఅవకాశం పోగొట్టుకొన్నందుకు నా తెలివికి నేనే తిట్టుకొని, స్త్రీలోకాన్నిగూర్చి ఏమోమో అనుకొన్నానుకూడ నేను'

'అవును. నాకు తెలుసు మీరలా అనుకొంటారని. ఏవో మాటలుచెప్పి మాయమైన అవివిసిట్టనుకొంటారని అప్పుడే భయ

వడ్డాను. ఆ దినమే మీరు చూచి వెళ్ళిపోతారనుకొన్నాను. ఈదినం ఈతోటలో ఉంటారని పూర్తిగా నాకు నమ్మకంలేనేలేదు. ఐనా మీరు ఉండాలనీ, నాకోసం మిమ్మల్ని ఉంచాలనీ భగవంతునికి అనేక మొక్కులు మొక్కుతూ భయలుదేరాను—'

'మొక్కులతో భగవంతునికూడ ఆశపెట్టి అరుదెంచేవన్న మాట—'

'ఆశపెట్టి ఊరుకోనుగా. మిమ్ములను మరల నన్ను కలుసుకోన చేసినందుకు మొక్కులను మా ఊరువెళ్ళడంతోనే తీర్చుకొంటాను'

'నేను నాలోసంకల్పించుకొన్న ఊహల్ని పూర్తిగా నెరవేరుస్తే భగవంతునకు వాయిదాలువేయకుండ అర్పించుకొంటాను పూజా కట్నాలు—' అన్నాడు పోటీగా ఆమెవంక అదోలా చూచి నవ్వుతూ—

'లంచమియ్యదలచారన్నమాట భగవంతునికి మీరుకూడ'

'ఏమైనా యివ్వదలచాను నాకోరికలు నెరవేరుతే—'

'నెరవేరు అవకాశాలు అగుపడుతూన్నాయా?—' అంది వంచిన కండ్లచివర్లనుంచి చిరునవ్వుతో చూస్తూ.

'ఊ—యిప్పుడే చెప్పాలా?—'

'ఏం!—ఊహించి చెప్పలేరూ?—'

'నేను చెప్పడంలో మీకుగల ప్రయోజనం!—'

'ప్రయోజనానికి ఏముంది. ఇద్దరుకలసి ఒకేమారు ఒకేదేవాలయంలో మొక్కుబళ్ళు చెల్లించుకోవచ్చునని—' అంటూ ఉబికివచ్చే నవ్వును ఆపుచేసుకోలేక అరుణ పకపక నవ్వింది. కృష్ణుడుకూడ ఆమె వెకిమాటలకు ఆకర్షితుడై ఆమె నవ్వువకు సృతిగా తన నవ్వును కలిపాడు. వంపులుదేరి బిగువుగా కోటు చొక్కాచారలలోంచి ఉబికి ఎత్తుగా అగుపడే ఆమె రొమ్ములకదలిక నవ్వు అందంతో కలిపి అతని చేతివేళ్ళను లాగిస్తున్నది రైడక్సూను చుట్టుకొన్న ఆమె

నాగరికతావేషదారుణ ఆతడ్ని ముగ్ధుడ్ని చేసింది. నల్లని మెలికలతో జారి తెల్లని—ఆమె నుదుర్ని ముద్దెట్టుకొంటూన్న తలఅందం—మల్లిమొగ్గల్లాంటి తెల్లని ఆమె పలువరస తోటనుసహితం ప్రతిధ్వనించే గంటలమోస్తరు ఆమె నవ్వు ఆతనిలో ప్రత్యేకస్థానాల్ని ఏర్పరచుకొన్నాయి.

'నాకోసం పండ్లు దాచిఉంచుతానన్నారుగా. యివ్వండి'

'రండి—ఆ చెట్టుపండ్లను కోసి—'

'అమ్మయో!—నేనురాను, ఆచెట్టునుచూస్తేనే ఆకోతి జ్ఞప్తికి వస్తుంది—'

'నేనుఉన్నానుగా. ఆకోతి అప్పుడేపోయింది. మనలను కలవడానికి ఆకోతి ఆ దినం ఆ ఉపకారంచేసి వెళ్ళింది—' అని ఆతడు అంటూంటే అరుణ ఆతనిని రాచుకొంటూ వెనుతిరిగింది చెట్టును సమీపించడాలికి. ఆ స్పర్శతో ఆతనిలోని భయాలన్నీ పటాపంచలై ఏకాంతంగా తనముందు చెట్లతోపులో నిలచిన ఆమెమీద ఆతనికి అధికారం ఏర్పడినట్లయింది. ఆక్షణాలో యిహ ఆమె అంతఅందంతోనూ తనకు లోబడినట్టుగనే తృప్తిపడుతూ ధైర్యాన్నికూడ దీసుకొని ముందుగా చెట్టువైపునడుస్తూన్న ఆమె బుజంమీద తన చేతివ్రేళ్ళువేసి జార్చాడు? ఆమె తన పెద్దవల్లకనుపాపల్ని ప్రక్కలకుకదల్చి సిగ్గుతో నవ్వింది.

'మీతో యిలా తిరుగుతూన్నానని మానాన్నగారికి తెలుస్తే యిహ నన్ను రానిస్తారా!—'

'అప్పుడు మరీ మంచిది. ఇద్దరం ఈతోటలోనే హాయిగా అతుక్కొని తిరుగుతూ ప్రేమపక్షులమై ఒక కొమ్మమీంచి మరొక కొమ్మమీదికి—'

'ఆపక్షులకు ఎగరడానికి రెక్కలుంటాయి. మనకి అవి పూజ్యంగా' అంది వారచూపుతో—

'వాటికిబదులు యివిగో—ఈ చేతులున్నాయికదూ—ఇలా చేతులుకలుపుకొని స్వేచ్ఛగా సకలమూ మరచి ఆత్మల్ని ఆకాశవీధుల లోకి విడుస్తూ—'

'జంటపావురాల్ని ఆకాశవీధులలోనికి విడచిపెట్టినట్టుకదూ!—' అంది ఆమె తన మెరుస్తూన్న కనుపాపల్ని పెద్దవిచేసి కృష్ణుడు ఆమె బుగ్గమీద చిన్నచిటికవేశాడు. అరుణ ఆతనిచేతిని అందుకొంటూ దగ్గరకులాగుకొంది. తోడనే ఆతడు దగ్గరకుచేరి ఆమెనంతా తన చేతుల లోనికి తీసుకొని, వెనుతిరిగిన ఆమెవీపుకు తనవక్షాన్ని, శరీరాన్ని వొత్తుగా ఆనించి చేతులతో అంతా స్పృశిస్తూ ఆమెనుదేకింపచేశాడు. ఆమె మూర్ఛలతో మునిగిపోయే అర్ధనిమీలితనేత్రాలతో ఆతని కండ్లలోనికి చూస్తూ తనచేతుల్ని ఆతని మెడకుచుట్టి ఆవేశంతో ఏదో మాట్లాడ బోతూన్న ఆతనినోటిని తన పెదవులతో ఆపింది. తన్ను పెనవేసుకొని తన ఎర్రనితీర్చిన పెదవులను అందించునప్పటితీవ్రతలోని ఆమె వొదుపు వొయ్యారం—కృతజ్ఞత—అభిమానం ఆతనిలోని వాంఛల్ని రేపి ఉదుకెత్తించాయి. ఆఎత్తుగడ్డిలోతులో యిద్దరూ నెమ్మదిగా కూర్చుంటే గాలికి రెల్లుగడ్డి తలలువంచి వాళ్ళను కప్పివేశాయి.

---

# 3

కరకటశాస్త్రిగారి అమ్మాయికి అన్నప్రాసన సందర్భంలో ఆనంద పురంలోని బ్రాహ్మణులందరికి విందు ఏర్పాట్లు జరుగుతున్నాయి. ఆదినం శాస్త్రిగారియింటిలో బ్రాహ్మణముత్తైదుల హడావుడి, విభూది పిండికట్ల బ్రాహ్మణులు పక్క అరుగులమీద చాపలువేసుకొని ముక్కు పొడుంపట్లతో లోకాభిరామాయణం ముచ్చట్లు జరుగుతూన్నాయి. సిసులకోసం కేంపువేసుకొని ఆపరిసరగ్రామాలలోఉన్న గణపతిరావు

గారుకూడ విందునకు ఆహ్వానింపబడడంచేత పతిగారు అరుణతోకూడ శాస్త్రిగారి పక్కయింటిలో విడిది దిగారు.

పండ్రెండు దాటింది. వరసగా పంక్తిలపద్ధతిని విస్తర్లు వేస్తున్నారు. అంగవస్త్రపుబ్రాహ్మణులు వడ్డనలుకూడ జరుగుతూన్నాయి. బ్రాహ్మణబృందమంతా కాళ్ళు కడుగుకోడానికి ఒక్కొక్కరే అరుగులు దిగుతున్నారు. అంతలో కరకటశాస్త్రిగారు చెమటను తుడుచుకొంటూ ఈవలకు వచ్చి—

'కరణంగారు వచ్చారా?—'

'అబ్బే—రాలేదండి. కబురుచెయ్యండి' అన్నాడు గుంపులోని ఒక బ్రాహ్మణుడు.

'అరేయి—శేషూ—కరణంగారిని తొందరగా పిలుచుకొని రారా. వడ్డనలుకూడ అవుతూన్నాయనికూడ చెప్పు'

'రమ్మన్నానండి. ఆయన రానన్నారు'

'కారణం?—'

'ఇక్కడ అనిష్టజరుగుచుందని, ఆపంక్తిలోకూర్చొన తన కిష్టం లేదని అంటూన్నారు'

'అదేమిటో నలుగురిముందరా చెప్పి ఆ అనిష్టజరుగని పద్ధతి చూడాలిగాని—ఇదేమిటి! ఆఖరునిమిషంలో రానిపివో అడ్డాలువేస్తే యింతకార్యం అడ్డిపోవలసినదేనా?—'

'అదేదో—మీరే అడిగిరండి శాస్త్రిగారు' అన్నారు అక్కడి బ్రాహ్మణులంతా తెల్లముఖాలువేస్తూ. శాస్త్రి నడుంబిగించుకొంటూ మెట్లుదిగి కరణంగారి యింటికి వెళ్ళబోతూండగనే కరణం మరి యిద్దరు అగ్రహారం బ్రాహ్మణులతో అక్కడకు చరాచరానడచి వచ్చారు. ఆతనిరాకను గమనించిన కరకటశాస్త్రుర్లు అక్కడనే నిలచిపోయాడు.

'ఏమండీ—విందుకు తమరు రానన్నారట—'

'అవును. రానన్నాను'

'ఐతే—మేము చేసిన తప్పేముందండి రానడానికి. అందులో ఆఖరునిమిషాన్ని మీరు యిలా కార్యభంగంచేస్తే—'

'ఎవరుచేశారు కార్యభంగం?—నాకిష్టంలేదు ఈవిందులో కూర్చోడానికి—మానుకొన్నాను'

'అది ఏమిమాటండీ కరణంగారూ—పాపం ఆయన బోలెంత డబ్బుఖర్చుచేసుకొని శుభమంటూ కార్యం చేసుకొంటూంటే కారణం లేకుండా పంక్తికిరాననడం—'

'కారణంలేకపోవడంఏం!—కావలసినంత ఉంది'

'ఐతే చెప్పండి ఆ నేరంఏమిటో. తప్పంటే కాళ్ళమీదపడి—'

'మీరు తప్పుచేశారనికాదండి శాస్త్రిగారూ'

'మా తప్పులేకపోతే మా యింటికి రావడానికేం?'

'వెలివేసి దూరంగాఉంచవలసిన వారినికూడ విందుకుపిలచినందుకు'

'అట్టివారిని ఎవరిని పిలిచారండీ ఆయన మన అగ్రహారంతప్ప యితరబ్రాహ్మణకుటుంబాలు లేనేలేవుగా'

'నాకెందుకండీ మధ్య నిష్ఠూరంపడడం. నేనుమాత్రం రాను ఈ విందుకి'

'అదేంమాటండి. కూడనిబ్రాహ్మణుడు ఎవరైనాఉంటే వాడు చేసింది యిది అని చూపి చెప్పడం మంచిదిగాని అందీఅందని మాటలతో పాపం ఆబ్రాహ్మణుని ప్రయత్నాలన్నీ రసాబాసచేయడం అంత మంచిపని కాదండీ కరణంగారూ' అన్నాడు ఓబ్రాహ్మణుడు పిలకను సర్దుకొంటూ—

'గొప్పవాడు ఏపనిచేసినా పయికిరాదు. అది ఋజువుకాదు. కూడ. ఓవేళ కష్టపడి ఋజువుచేసినా అది నమ్మకాలజాబితాలోనికి రానేరాదు'

'ఏమిటిమాటలండీ అవి. అసలు విషయాన్ని చెప్పకుండ సందర్భంలో విడచి మాట్లాడడం—'

'అవును. అదే మాట. ఆ నేరంచేసిన వ్యక్తి ఎవరో తెలిపి, వాడు పంక్తికిరా కూడదని కారణాలుకూడ తెలుపుతూ ఆ కారణంచేత రానంటే అర్థంఉందిగాని—'

'ఏమండోయి!—ఆ తప్పుచేసినవారిని పూర్తిగా తెలిసిఉండి కూడ అది నలుగురిలో అనలేక పంక్తికి సిద్ధమైనరకాలు యిక్కడ చాల ఉన్నాయి. కాని అట్టి అనిష్టలు నాకండ్లఎదుట జరుగడానికి నేను ఒప్పుకోను'

'పోనీ—మీరు చెప్పకూడదూ!—'

'నేను చెపుతే మీరు ఆమోదిస్తారా?—'

'ఆ. అది నమ్మవలసినదే అయితే తప్పక ఆమోదిస్తాం—'

'అయితే—అదిగో ఆ విడుదిఅరుగుమీద నిలచిఉన్న గణపతి రావుగారు పంక్తికివస్తే నేను రాను—' అని కరణం గంభీరంగా అంటూంటే అంతకుముందే ఆతగువును వినడానికి వీధిఅరుగుమీద నిలచి ఉన్న గణపతిరావుగారు ఆతనిమాటలకు నిశ్చేష్టుతుడై నోటమాటరాక అక్కడనే నిలచిపోయాడు. ఆతనిప్రక్క పతిగారి ముఖభావాన్ని కని పెడుతూఉన్న విశ్వాసరావు అరుగుదిగి ఆ బ్రాహ్మణసమూహాన్ని చేరుతూ—

'ఏమిటండీ మీరు అంటూఉన్నది. నలుగురిలోనూ నోటికివచ్చి నట్లు వదులుతే పరువునష్టదావాతో కోర్టులుఎక్క—'

'ఏమండోయి—ఈడబాయింపులికి మీడబ్బుకి మేము జడియం. పట్నవాసాలతో ఏపాడుపనులుచేసినా చెల్లిపోతాయి. కాని ఈఆనంద పురంలో బ్రాహ్మణకుటుంభంలో అలాజరగడానికి వీలులేదని హెచ్చ రిస్తూన్నాను తెలుసుకోండి'

'గణపతిరావుగారిలో తప్పేమిచూచి మాట్లాడుతున్నారు మీరు'

'తప్పా!—పిల్లి కండ్లుమూసుకొని పాలుత్రాగుతూ జగమంతా చీకటే అనుకొంటుందట'

'పోనీ—కండ్లుతెరచుకొని కూర్చున్న తమరు ఆయనలోనిలోట్లు ఏమికనిపెట్టారు?—'

'లోట్లా!—యింకా ఏమనిఅడగడానికివచ్చావయ్యా. ఆయని పెండ్లికాని పద్దెనిమిదిఏండ్ల ముద్దుకూతురు తోటలవెంటతిరిగి అగపడిన కుర్రవెధవలతో ఆత్మగౌరవమునువిడచి బ్రాహ్మణపుట్టుకఅని అయినా తలచకుండ—'

'కరణంగారూ!—యోచించేమాట్లాడుతున్నారా?'

'నిజానికి యోచన ఎందుకయ్యా—' అని కరణం గట్టిగా అంటూంటే గణపతి పట్టలేనికోపంతో అరుగుదిగి—

'పంతులూ!—వళ్లు దగ్గరఉంచుకొని మాట్లాడు. పల్లెటూరిలోనే నీబడాయిఅంతా. ఊరుపొలిమేరుదాటుతే—'

'నాబడాయిమాటకేం!—తమపరువును పదిలపర్చుకోండి'

'నాకుమార్తెమీద నేరంమోపుతూన్న నీవు నీతప్పుడుమాటల్ని ఋజువుచేయగలవా?—'

'ఆ. తప్పకచేస్తాను. చెయ్యగలనుకూడ'

'జాగ్రత్త. అది ఋజువుకాకపోతే నీబ్రతుకు ఏమవుతుందో—?'

'భయపెట్టి తప్పుకొనచూస్తూన్నారా?—పిలువండి మీ కుమార్తెనే. ఆమె చెపుతుంది దేవునిముఖంచూచి' అని కరణం నిశ్చల గుండెతో అదురుబెదరులేక అంటూంటే పతి ఉగ్రుడై తన విడిదిగృహానికి భూమిఅదరేలా అడుగులువేస్తూ వెనుతిరిగి నడచాడు. అక్కడ అంతజనంలోనూకూడ నిశ్శబ్దం ఏర్పడింది. అక్కడివారి అందరికండ్లు

అవిశివి యింటిద్వారంవైపు చూస్తూన్నాయి. అరుణ చెరిగినతలతో వల్చని సిల్కుచీర పమిటకు వంటినిండ కప్పుకొని తండ్రివెనుక వచ్చింది.

'ఇదిగో నాకుమార్తె. ఈమెనేకదూ నీవు కులటనుచేసి మాట్లాడుతూండేది'

'ఆగండి. ఆమెనే అడుగుతాను—' అని కరణం విషపునవ్వుతో అంటూంటే అరుణ అతడువేయు ప్రశ్నలుకోసం వేచియున్నట్లు చూస్తోంది.

'రమణారావుగారి కొడుకు కృష్ణారావుని నీవు ఎరుగుదువు కదమ్మా—'

'ఆ—'

'ఆతోటలోనేకదూ ఆతనితో పరిచయం'

'ఓమాటు గుఱ్ఱందిగాంచి వస్తూంటే కోతిబారినుంచి ఆయన తప్పించాడు'

'ఆయనను నీవు ప్రతిరోజూ ఆతోటలో కలుసుకోవడంకూడా ఉందికదూ—'

'...............'

'మాట్లాడరేం!—చెప్పండి'

'ఉహూ—'

'అప్పుడప్పుడైనా కలుసుకోవడం ఉందికదూ!—' అని కరణం ఆమెను అడుగుతూంటే అక్కడి బ్రాహ్మణులంతా ఒకరిముహం ఒకరు చూచుకొంటూ దొంగనవ్వులు నవ్వుకొంటూన్నారు. కరణంగారి ఆఖరుప్రశ్నలకు అరుణసమాధానంకోసం కాచుకొంటూంటే, ఈసంఘటననుగూర్చి విన్న కృష్ణరావు ఆస్థలానికి పరుగెత్తుకొనివచ్చి ఆ సమూహాన్ని చీల్చుకొంటూ ముందుకు త్రోసుకొనివచ్చాడు.

'కరణంగారూ!—మీసందేహాలు నానుండి తెలుసుకోండి. పాపం ఆమె నిష్కళంకిత'

'అయితే ఆమెను నీవు ఎరుగనంటావా?—'

'ఎరుగకేం!—ఆమె కోతిచేత అడ్డబడి అవస్థలుపడుతూంటే దానిబారినుండి రక్షించాను. ఆసంఘటనవల్లనే ఆమెను తెలుసుకొన్నాను.

'అయితే—ఆమె నీకడకు ఆతోటలోనికి ప్రతిదినం గుట్టంమీద రావడంనకు కారణం?—'

'అప్పుడప్పుడు షికారుగా ఆమె గుట్టంమీద వెళ్లుతూంటే నేనే కలుసుకొని మాట్లాడేవాణ్ణి'

'ఆమెమాట్లాడేదా?—'

'ఆ. నానహాయాన్ని పొందిన ఆమె మాట్లాడిందంటే తప్పేముంది'

'అయితే ప్రమాణంచేసి చెప్పు అమ్మాయి—ఈతని ప్రేమించలేదని—' అని ఆమెను కరణం అంటూంటే అరుణ కాదనలేక కండ్లనీరుపెట్టి అక్కడనుంచి కదలిపోచూస్తూంటే, కృష్ణుడు కండ్లవెంట అగ్నికణాల్ని రాలుస్తూ—

'ఇదిగో కరణంగారూ!—బుద్ధిహీనంగా నడచేను మీముందబుద్ధికి నాకేజాలివేస్తోంది. అయినింటిపిల్లను అకారణంగా నలుగురిలోనూ నిందపరచి హేళనగా—'

'నీకు ఆమెపట్ల ప్రేమలేదని ప్రమాణంచేసి చెప్పగలవానీవైనా'

'ప్రేమలేదని ఎవరుచెప్పారు?—కాని అది సోదరసోదరీప్రేమ అని మాత్రం నీవు గ్రహించాలి'

'నీవు ఆమెను సోదరిగనే పరిగణిస్తూన్నావా?—నీవు అసత్యవాదివి కావని నాకు తెలుసు. నీమాటయందు నాకు నమ్మకమేవుంది కాని—'

'నామాటమీద నమ్మకమేఉంటే ఆసంగతి నన్నేఎందుకు అడుగ లేకపోయారు?—'

'ఆవిషయం అటుంచి ఆమెపట్ల నీకు సోదరిప్రేమతప్ప వేరు భావంలేదని ప్రమాణంచేసి చెప్పు—ఇదే అగ్నిపరీక్ష'

'ఆ. ప్రమాణంచేసి చెపుతూన్నాను. ఆమె నాసోదరి—' అని కృష్ణుడు నిర్భయంగా చెపుతూంటే అరుణ అక్కడ నిలువలేక పమిట చెంగుతో కండ్లనుతుడుచుకొంటూ విడిదిగృహంలోనికి పరుగెత్తింది. అక్కడి దృశ్యాన్ని చివరంటాచూస్తూన్న బ్రాహ్మణులంతా అర్థంకాని భావాల్ని కండ్లనుంచి వెడలగ్రక్కుతూ ఒక్కొక్కరే అక్కడనుంచి చెదరిపోతూంటే—విశ్వాసరావు పతిగారినిచూచి—

'పతిగారూ—పదండి. యువనంలోఉన్న వాళ్ళిద్దరూ పదేసార్లు కలుసుకొని తిరగడం ఆయనకు అనుమానంతోచిఉంటుంది. ఇందులో ఎవరితప్పూలేదు. ఆ అబ్బాయికూడ ప్రమాణంచేసి చెపుతూండడంచేత యిహ అందరి అనుమానాలు నశించాయి. ఆడపిల్లల్ని కట్టుబాట్లలో ఉంచకబోతే యిట్టి చిక్కులేవస్తాయి—'

'ఎంతఅవమానం!—'

'ఏం అవమానంజరిగింది!—నిజం తెలుసుకొన్న తరువాత ఆకళం-కమే లేకుండాపోయిందిగా. మరుగుగాలేని విషయం ప్రాకడంకంటే నలుగురిలోనూ తేలిపోయింది కాబట్టి అసలు ఆవిషయాన్నే మనం మన సులో పెట్టుకోనేకూడదు. పదండి—' అంటూ విశ్వాసరావు పతిగార్ని విడిదికి తీసుకొనిపో, కరణంవంక దొంగనవ్వుతోచూచి యిహ ఊరుకో మన్నట్టుగా కనుసన్నచేసి లోనికిపోయాడు. కరణం ఆతనికి సమాధానంగా నవ్వి ఊరుకొన్నాడు. అప్పటికే ఆలస్యంఅయి ఉండడంచేత బ్రాహ్మణు లంతా పంక్తులలోకూర్చొని భోజనాలుసాగిస్తూ, పతిగారినికూడ పంక్తిలో కూర్చుండబెట్టి ఆ శాస్త్రకార్యం నిర్విఘ్నంగా జరిపించివేశారు.

---

## 4

కరణంగారి యింటిచావిడిలోని పెద్దగడియారం తొమ్మిది అప్పుడే కొట్టింది. ఆకాశంమీద జల్లెడచిల్లులా అగుపడే నక్షత్రముల కాంతి తప్ప చంద్రుడు అగుపడడమేలేదు. అడ్డతీగెలలో అప్పటికే ఊరువారు వాడుకప్రకారం భోజనంలుచేసి మాటుమడుగుతూఉన్నారు.

ఆవేళలో కృష్ణుడు అరుణ యింటిసమీపంలో తోటప్రక్కనున్న విరిగిన బండిదగ్గరకువచ్చి నిలచాడు. చుట్టును మినుగుడుపురుగులు ఘీంకారములుతప్ప ఆతనికి మనుష్యచాయలు అగుపడడమేలేదు. ఆతడు అరుణ యింటిగుమ్మంవంక దృష్టినిలిపి ఆమె రాకకోసం ఎదురుచూస్తూ ప్రతినిమిషం గంటలుగా గడుపుతూన్నాడు.

అంతలో దొడ్డిగుమ్మం తెరచిన వెలుగు అగుపడింది ఆతనికి. అరుణేవస్తుందనుతలపుతో అప్రయత్నంగా రెండడుగులు ముందుకువేసి నిలచాడు. చీర మీదముసుగువేసుకొని శరీరం కప్పుకొన్న అరుణ ఆతడు నిలచినస్థలానికి చకచక నడచివచ్చింది.

'అరుణా!—'

'కృష్ణా!—'

'ఆ—నేనే'

'వచ్చావా!—నాఉత్తరంఅందిందా?—'

'ఆ. నీమాటను తోసివుచ్చి ఎలారాకుండాఉండగలను' అని కృష్ణుడు అంటూండగనే అరుణ ఆతనిచేతివేళ్ళను తనచేతిలోనికి తీసుకొని గోముగావ్రాస్తూ—

'కృష్ణా—ఒకటి రెండు దినములలో మేము ఆత్రేయపురం వెళుతూన్నాము. నువ్వు అక్కడ నన్ను కలుసుకొంటావుకదూ!—'

'అరుణ—యిహ నన్ను మరువడానికి ప్రయత్నంచెయ్యి. మన కలయిక మీనాన్నగారి గౌరవమునకు కళంకం ఆపాదిస్తుందని భీతిగా కూడ ఉంది—'

'ఏమిటీమాటలు కృష్ణా. నీ మనసు మారుతూందా!— నాపట్లగల నీ పూర్వప్రేమను నీ హృదయంనుంచి తుడిచివేస్తూన్నావా? అవును. అప్పుడే అనుకొన్నాను. ఆదినం నాఎదుటనే నన్ను నీసోదరిగా చూచుకొంటూన్నానని చెప్పినప్పుడే నాశిరస్సుమీద సమ్మెటపెట్టు పెట్టి నట్టయింది. అప్పుడే నీమనసు మారుతూందని దిగులుపడ్డాను—'

'అవును. నీగౌరవం—నీ తండ్రివంశమర్యాద కాపాడడానికి ఏప్రమాణమైనాచేసి మీకు రాబోయేకళంకానికి అడ్డునిలువదలచాను. అందుచేతనే అలామాట్లాడి యిహాముందు నీతో సభంధాన్ని త్రెంచు కొన నిశ్చయించానుకూడ'

'కృష్ణా—నీకు కోపంవచ్చిందా!—ఆదినం ఆయన మన కలయిక గూర్చి అడుగుతూంటే నిజంచెప్ప సాహసింపలేనందుకు నన్ను అనుమా నిస్తూన్నావా?—'

'పిచ్చిదానా—నాకావిషయంలో కోపమేలేదు. నీవు అప్పట్లో ఊరుకొని నేను మాట్లాడునందుకు అవకాశం కలిగించడమే మంచి దయింది—'

'ఇహ నాకు కనబడకూడదని నిశ్చయించుకొనావా?—'

'కాదు అరుణ. నిన్ను యిప్పటివరకు హృదయంనిండిన ప్రేమతో ప్రేమిస్తూనేఉన్నాను. కాని—నీకోసం —నాబాలికగౌరవంకోసం— నీవంశమర్యాదకోసం నామనస్సు మార్చుకొనవలసివస్తూంది. ఇంత అల్లరి అయినతరువాతకూడ మనము కలియడం ఎవరైనా కనుగొన్నా రంటే మీతండ్రిమనస్సులో నీవు అగ్నిని రగిల్చినదానవౌతావు. నిశ్చ లంగా యోచించి నన్ను మరచిపో—'

'అలాజరుగవీలులేదు. అవసరమైతే మానాన్నగారికికూడ తెల్పి మిమ్ములనే వివాహం చేసుకొంటాను—'

'అంతమందిలో అల్లరైన నావిషయంలో ఆయన ఒప్పుకోరు. అయినా—నీవుకూడ యోచించాలి అరుణా. నలుగురిలో ప్రమాణం చేసి—'

'హిందూధర్మాలనుమరచి మాట్లాడుతూన్నావు నీవు. ఓసారి ప్రేమించి పరిణయమాడచూచిన నామనస్సుని యింతలో మార్చుకోన—' అని ఏమో అంటూండగనే వెనుక దొడ్డితలుపు ఎవరో తీసిన వెలుగు అగుపడింది. కృష్ణుడు ఆమెచేతిని తన రెండుచేతులతో పట్టుకొని విడవలేని కాంతులతో ప్రాస్తూ—

'అరుణా!—అదిగో ఎవరో నీకోసం ఈవలకువస్తూన్న ఛాయ అగుపడుతూంది. నీవు వెళ్ళు—'

'కృష్ణా!—యిహ కనబడవా?—అరుణను మరువడానికే నిశ్చయించావా?—'

'అరుణా—నీ తండ్రిగౌరవంకోసమైనా మనప్రేమను త్యాగం చేయాలి. మనకెట్టిసంభంధమూలేదని నలుగురిలోనూ ప్రమాణంచేసి యింతలోనే—'

'కృష్ణా—ఏమైనాకాని—నిన్ను విడిచిపోవ నామనస్సు అంగీకరించడంలేదు. నీతోగడిపిన ఆ సౌఖ్యగడియలకోసం—నిరంతరం నీ ప్రక్కనే ఉండాలనే అనంతకోరికలు అణచుకోవడం కష్టంగనే—'

'అదిగో—ఎవరో లైటుతో ఈవలికివస్తూన్నారు. ఊ—వెళ్ళు .అరుణా—'

'కృష్ణా—'

'ఉష్—వేగిరపడు—'

'మరల ఒక్కసారి కలసుకొనప్రార్థన—'

'ఊ—సరే. వెళ్ళు—'

'నాచేతిలో చేయివేసి ప్రమాణంచెయ్యండి మరల కలుసుకొంటానని—'

'ఏమిటీమాటలు కృష్ణా. నీ మనసు మారుతూందా!— నావట్లగల నీ పూర్వప్రేమను నీ హృదయంనుంచి తుడిచివేస్తూన్నావా? అవును. అప్పుడే అనుకొన్నాను. ఆదినం నాఎదుటనే నన్ను నీసోదరిగా చూచుకొంటూన్నానని చెప్పినప్పుడే నాశిరస్సుమీద సమ్మెటపెట్టు పెట్టి నట్టయింది. అప్పుడే నీమనసు మారుతూందని దిగులుపడ్డాను—'

'అవును. నీగౌరవం—నీ తండ్రివంశమర్యాద కాపాడడానికి ఏపత్రిమాణమైనాచేసి మీకు రాబోయేకళంకానికి అడ్డునిలువదలచాను. అందుచేతనే అలామాట్లాడి యిహముందు నీతో సభంధాన్ని త్రెంచు కొన నిశ్చయించానుకూడ'

'కృష్ణా—నీకు కోపంవచ్చిందా!—ఆదినం ఆయన మన కలయిక గూర్చి అడుగుతూంటే నిజంచెప్ప సాహసింపలేనందుకు నన్ను అనుమా నిస్తూన్నావా?—'

'పిచ్చిదానా—నాకావిషయంలో కోపమేలేదు. నీవు అప్పట్లో ఊరుకొని నేను మాట్లాడునందుకు అవకాశం కలిగించడమే మంచి దయింది—'

'ఇహ నాకు కనబడకూడదని నిశ్చయించుకొన్నానివా?—'

'కాదు అరుణ. నిన్ను యిప్పటివరకు హృదయంనిండిన ప్రేమతో ప్రేమిస్తూనేఉన్నాను. కాని—నీకోసం—నాబాలికగౌరవంకోసం— నీవంశమర్యాదకోసం నామనస్సు మార్చుకొనవలసివస్తూంది. ఇంత అల్లరి అయినతరువాతకూడ మనము కలియడం ఎవరైనా కనుగొన్నా రంటే మీతండ్రిమనస్సులో నీవు అగ్నిని రగిల్చినదానవౌతావు. నిశ్చ లంగా యోచించి నన్ను మరచిపో—'

'అలాజరుగవీలులేదు. అవసరమైతే మానాన్నగారికికూడ తెల్పి మిమ్ములనే వివాహం చేసుకొంటాను—'

'అంతమందిలో అల్లరైన నావిషయంలో ఆయన ఒప్పుకోరు. అయినా—నీవుకూడ ఆలోచించాలి అరుణా. నలుగురిలో ప్రమాణం చేసి—'

'హిందూధర్మాలనుమరచి మాట్లాడుతూన్నావు నీవు. ఓసారి ప్రేమించి పరిణయమాడచూచిన నామనస్సుని యింతలో మార్చుకోన—' అని ఏమో అంటూండగనే వెనుక దొడ్డితలుపు ఎవరో తీసిన వెలుగు అగుపడింది. కృష్ణుడు ఆమెచేతిని తన రెండుచేతులతో పట్టుకొని విడవలేని కాంక్షలతో వ్రాస్తూ—

'అరుణా!—అదిగో ఎవరో నీకోసం ఈవలకువస్తూన్న ఛాయ అగుపడుతూంది. నీవు వెళ్ళు—'

'కృష్ణా!—యిహ కనబడవా?—అరుణను మరువడానికే నిశ్చయించావా?—'

'అరుణా—నీ తండ్రిగౌరవంకోసమైనా మనప్రేమను త్యాగం చేయాలి. మనకెట్టిసంభంధమూలేదని నలుగురిలోనూ ప్రమాణంచేసి యింతలోనే—'

'కృష్ణా—ఏమైనాకానీ—నిన్ను విడిచిపోవ నామనస్సు అంగీకరించడంలేదు. నీతోగడిపిన ఆ సౌఖ్యగడియలకోసం—నిరంతరం నీ ప్రక్కనే ఉండాలనే అనంతకోరికలు అణచుకోవడం కష్టంగనే—'

'అదిగో—ఎవరో లైటుతో ఈవలికివస్తూన్నారు. ఊ—వెళ్ళు అరుణా—'

'కృష్ణా—'

'ఉష్—వేగిరపడు—'

'మరల ఒక్కసారి కలసుకొనప్రార్థన—'

'ఊ—సరే. వెళ్ళు—'

'నాచేతిలో చేయివేసి ప్రమాణంచెయ్యండి మరల కలుసుకొంటానని—'

'తప్పక కలుసుకొంటాను—' అని కృష్ణుడు ఆమెను తొందరచేసి తననుండి వెనకకుతిప్పి వెళ్ళమని తోస్తూంటే. అరుణ విడువలేని హృదయభారంతో వెనుకకు జాలిగాచూస్తూ తప్పనిసరిగ అక్కడనుంచి కదలిపోయింది. ఆమె అతనినుంచి వెళ్ళిపోతూంటే తక్కినరాత్రింతా కూడ మాధుర్యంతో నింపగలశక్తి తన నరాలకు లేకపోయిందే అని అతని అంతరాత్మ అతనిలోనుంచి అరచింది. కృష్ణుడు అంధకారంతో అలుముకొన్న తన హృదయఆరాటాన్ని అణచుకొంటూ ప్రకృతి చీకట్లలోనుంచి నడచిపోయాడు.

* * * *

'మామా—తొందరగా పరీక్షలు కావడంతోనే నన్ను రమ్మని ఉత్తరంవ్రాశారు ఎందుకు?'

'అవును. గణపతిరావుగారి కోరికమీద నీకు వ్రాశాను. పరీక్షలు పూర్తిఅయినట్లేకదూ!—'

'ఆ. సెలవులలో నాలుగుదినములు అక్కడ స్నేహితులతో గడిపి వద్దామనుకొన్నాను. కాని—మీఉత్తరమే నన్నింత తొందరగా యిక్కడకు మోసుకొనివచ్చింది'

'తొందరగారావడమే మంచిదయింది. పతిగారి మనస్సు క్రమారకుండానే నీవివాహం జరిగిపోయిందంటే నామనస్సు హాయిగాఉంటుంది'

'అంటే!—'

'పతివారి అమ్మాయి అరుణను నీకిచ్చి వివాహం చేయడానికి మాట యిచ్చాడు. ఆ వివాహం ఆయన తొందరగాజరిగించుపర్పాట్లు కూడ నేటివరకు చేస్తూనేఉన్నాడు'

'దానికి అంతతొందర్లో కారణంతెలువకుండ రమ్మన్నారేం!'

'పిచ్చివాడా!—వార్థికదశలో అతని మనస్సు ఎలాఉంటుందో చెప్పలేం. వయసులోఉన్న అమ్మాయి అరుణ. ఆమె పెండ్లితో వరుని

అదృష్టం మిన్నుఅందుకోడానికి అవకాశాలున్నాయి. ఆ ఆస్థిఅంతటికీ ఆవరుడే హక్కుదారుడై—'

'ఇప్పుడు నేను చేయవలసినదేముంది!—మీరు వివాహదినం నిశ్చయించి నాకువ్రాస్తే అప్పటికి రాలేకపోయియుందునా!—'

'నీవు ముందు యిస్టేటును హేండోవరు చేసుకొని, పనులను చక్క-చేసుకొంటూ అరుణహృదయాన్ని ఆకర్షించుకోవాలి—'

'అరుణకు నేనంటే సద్భావమేఉంది. ఆమెను నేను ప్రేమిస్తున్నట్టే ఆమెకూడ నాయందు—'

'హూ—స్త్రీహృదయం తామరాకుమీది తేట నీరువంటిది. అందులోనూ నీవు ఎరిగినవి ఆమె చిన్ననాటిదినములు. అప్పట్లోని నిశ్చయాలు, కోరికలు వేరు. ఇవుడు యవ్వనభావాలు—ఊహాలు వేరుగా ఉంటాయి—యిప్పట్లోనే—'

'మామా—పతిగారు ఊళ్ళోనేఉన్నారా?—'

'ఆ. నాలుగుదినములైంది మేమంతా క్యాంపునించి అత్రేయపురం చేరుకొని'

'వారు ఆదరణచూపుతూ పోష్టలుకు నాపేర వ్రాసిన ఉత్తరాలు అందినప్పుడు చాల ఆనందపడ్డాను'

'నీవు పెద్దచదువు చదివినవాడవనే అరుణను నీకీయస్థిరపరచుకొన్నాడు. అందుచేతనే ఆ వివాహం త్వరగా జరిగించకోరే నీకోసం తొందరగా ఉత్తరం వ్రాశాను'

'వెడదామా మామా! పతిగారియింటికి'

'ఊ—నీ స్నానం ముగించుకొని భోజనం కానియ్యి. తరువాత వెళ్ళవచ్చు. నీవు వచ్చినట్టుగా కబురుచేశానుకూడ ఆయనకు—' అని విశ్వాసరావుగారు మేనల్లుడు వానుతో చెపుతూండగనే వెంకన్న

ఆ స్థలానికివచ్చి ఆయనతో ఏదోమాట్లాడదలచి వచ్చినట్లుగా ముహంలో భావం అగుపర్చాడు.

'వెంకన్నా !—నాకోసంవచ్చావా?—అయ్యగారేమైనా కబురు చేశారా నీచేత'

'ఉహూ—లేదండి'

'మావాసు పట్నంనుంచి వచ్చినట్టు ఆయనకు కబురు అందిందా'

'ఆ, అందిందండి'

'మరి—నీరాక!—'

'మీతో మాట్లాడగోరి వచ్చాను'

'ఓహో—అదా!—వస్తూన్నాను. అరేయి—వాసూ! నీస్నాన పానాలు వేగంకానియ్యి. యిప్పుడే మనవెంకన్నతో మాట్లాడివస్తాను' అంటూ వాసును హాలునుంచి యింటిలోనికి పంపివేసి నటనలో ఆదరణను అగుపరుస్తూ వెంకన్నను సమీపించాడు.

'వెంకన్నా—అరుణవిషయములో రహస్యములేమైనా కని పెట్టావా?—'

'రహస్యానికి ఏముందండి. ఒక్కవిషయం—'

'ఏమిటది!—'

'అహ—వాసుబాబుగారువచ్చారని అక్కడకు వార్తరావడంతోనే పతిగారు ఆవార్తకు ముహంలో ఆనందాన్ని అగుపరుస్తు అరుణను పెద్దగా కేకవేసి పిలచి వాసుగారి రాకనుఎరుకపర్చారు. ఆమాటతో ఆమె వెలవెలబోతూ మాటలలోగాని ముహంలోగాని ఉత్సాహాన్ని అగుపర్చకుండ తలవంచుకొని ఊరుకొంది'

'కొత్తరుచులకు అలవాటుపడ్డ అంటుజాడ్యం దానిని వదులుతుందామరి. చూస్తాను!—దానిపెంకితనం ఏమిటో. వాసును ఎలా పెండ్లిచేసికోదో—ఏమవుతుందో—'

'ఏమండీ—ఆతరువాత లోనికిపోయి, మరి ఐదునిమిషములలో చుట్టుతిరిగి వచ్చి గేటుదగ్గరఉన్న నన్ను పిలచింది ఆమె'

'నిన్నే!—మంచివాడ్నే పిలచింది. ఊ—ఏమంటుందేం!—'

'ఎవరైనావచ్చి తన్ను అడిగిరా అంది. లేదని నేనుచెప్పాను. ఎవరైనా ఏవేళలోనైనా తన్ను అడిగినట్లయితే వెంటనేవచ్చి ఆమెకు తెలుపవలసినదిగా చెప్పి వెళ్ళిందండి'

'అంటే—ఎవరువస్తారని దానిఅభిప్రాయం!—'

'అంతమాత్రం తెలుసుకోలేదూ!—ఆకురాౖడు కృష్ణుడురాక కోసమే ఆ ాలుగాయి ఆరాటమంతాను'

'అబ్బా—ఎంతయోచన! నిజంగా నువ్వుఅన్నట్టు అది రాలుగాయే. చిన్నప్పటినుంచి పెంకిస్వభావంగలదే. అదేమిపాపమో—నన్నుచూస్తేనే సింహస్వప్నం దానికి'

'ఇహ—ఎంతలెండి. మన వాసుగారితో అమూదుముభ్యా పడ్డాయంటే ఆఅమ్మాయి ఆరాటలు అమాంతంగా ఆరి అప్పుడే ఊరు కొంటాయి'

'అవును. ఆవివాహం జరిగేవరకే నేనూ ప్రాణాలు అరచేతితో పట్టుకొని దానిని వగ్గాలలోపెట్టి అవుతూన్నాను. లేకుంటే అసలే పెంకి రాలుగాయి—నాకీపెండ్లేవద్దని పెంకిపట్టుపట్టిందంటే కథేచెడుతుందని భయం—'

'మరి అలా ఆమెపెంకిపట్టుపట్టి కూర్చుంటే ముందుకర్తవ్యం.!'

'అదంతా ఊహించే ఆనందపురంలో అల్లరిని రేకెత్తించాను. అప్పటి ఆసంఘటనకారణంగా ఆకురాౖడినిగూర్చి అవి తండ్రితో తెగించి చెప్పలేదు. చెప్పినా—నలుగురిలోనూ అంత అల్లరిఅయి, పూర్వ సంభంధములేక సోదరసోదరిలుగాఉన్నట్టు ప్రమాణంచేసి వప్పుకొన్న ఆపిల్లవానితో ఆమె వివాహానికి పతి వప్పుకోడు—'

'కారణం!—'

'కారణానికి ఏముంది!—అతడేకావాలని అది మొండిపట్టుపడితే ఆతనితో తనకు పూర్వసంబంధంమున్నట్టుగనే లెక్కకువచ్చి, వ్యభిచార దోషంక్రింద ఆరోపంపబడి పతికి, ఆతనికి నలుగురిలోనూ పరపతితగ్గి హాస్యాస్పదుడై —'

'ఎంతదిట్టమైనవారండీ మీరు. ఎంతదూరంయోచించి, ఎంత గందరగోళంచేసి విడచారు. అల్లరే యిప్పుడు ఆమెను కట్టుబాట్లో ఉంచింది'

'అప్పుడేఅయిందా! ఇప్పుడే జాగ్రత్తగాఉండాలి'

'యిహ ఏముంటుంది. మళ్ళీ ఆకృష్ణుడు యిక్కడకురాగలడనేనా మీ ఊహ'

'తప్పకరాగలడనే నా నమ్మకం. ఆతనికి ఏదోవార్త రహస్యంగా అది పంపియుండకపోతే, అది నిన్న అలాఎందుకు అడిగిఉంటుంది!— వాడిరాకకోసమే అది కాచుకొనిఉంది. వీలుచిక్కితే వాడితో ఎగిరి పోవ ప్రయిత్నిస్తూందేమోకూడ. కాబట్టి ఈనాలుగురోజులూ దాని ఛాయలోనే తిరుగుతూ—'

'అలాజరగనివ్వకుండ కాపాడుపూచి నాది. ఆభారం నామీద విడువండి'

'అవును. నీసామార్థ్యము, విశ్వాసమూ ఎరిగి ఆ నమ్మకంతోనే ఆకార్యభారాన్ని నీమీద ఉంచాను'

'ఓవేళ వాడేవస్తే అయ్యగారి ఎదుటపెట్టి నాలుగు చివాట్లు వేయించి—'

'అదేపొరపాటు. ఆతనివిషయం పతిగారివరకు వెళ్ళిదంటే అరుణ తెగించి ఆక్షణంలో ఆతనిని కాపాడడానికి ఆతనిని ప్రేమిస్తూనట్టుగాచెప్పి వేస్తుంది. ఆ మాటమీదనే ఆమె గట్టిగా నిలచిందాంటే పతిఎదురుతిరుగ

లేదు. నాకు తెలును అతని స్వభావం గాన ఏదోయుక్తిపన్ని తీరుగవాడు యిక్కడికి రానివప్రయత్నంచేయాలి'

'బడితిబజాపట్టి పంపమంటారా?——'

'ఉష్——అదీకూడదు. వాడు రావడమేజరుగుతే వారిమాటలు జాగ్రత్తగావిని, వాడివినికిడినిగూర్చి నాకు వార్తఅందచేశారంటే తక్కిన కర్తవ్యం నేను చూచుకొంటాను——' అని విశ్వాసరావు వెంకన్నకు చేతులుతిప్పి నచ్చచెవుతూంటే వాసు స్నానంచేసిన తడితలను టవలుతో తుడుచుకొంటూ ఆస్థలానికి వచ్చాడు. ఆతనిరాకతో విశ్వాసరావు వెంకన్నతో ప్రసంగమును చట్టునఆపి, వాడిని అక్కడనుంచి పంపివేశాడు. వెంకన్న పోవడంతోనే ఆయన వాసు భోజనసౌఖర్యములు చూడడానికి లోనికివెళ్ళాడు.

---

## 5

వాసును ఆహ్వానించి పతిగారు ఆతనిపట్ల అధికఅనురాగాన్ని చూపుతూ ఆదరణతో మాట్లేడేవాడు. అరుణతో వాసుపెండ్లి మరి వారంరోజులలో జరుగునట్లు ఖాయమై పెండ్లిప్రయత్నములు చురుకుగా జరుగుతూన్నాయి. విశ్వాసరావుగారే పతిగారియింట్లో సర్వాధికారాన్ని చెలాయిస్తు పతిగారిని లోబరచుకొని ప్రవర్తిస్తూన్నాడు.

విశ్వాసరావు పోకడలుచూస్తూంటే అరుణకు అసహ్యామేసేది. కాని——అంతకుముందే అల్లరిపాలవడంచేత ఎదిరించి ఏవిషయంలోనూ మాట్లాడలేకపోయేది. వాసు మామూలుగా పూర్వపరిచయాన్ని పురస్కరించుకొని విశ్వాసరావుగారిప్రేరణవల్ల——ఆమె ఏకాంతంగాఉన్న సమయాల్లో ఏదోమాట్లాడ ఉపక్రమించేవాడు. కాని అరుణమాత్రం ముక్తసరిగా మూడుమాటలతో ఆతనిని తన గదినుంచి బయటకువెడల

నడపేది. అదంతా క్రొత్తపెండ్లికూతురు కాబోతూండడంచేత సిగ్గుతో మనసువిచ్చి మాట్లాడలేకపోతోందని నిరుత్సాహపడిన వాసుకుండేకు విశ్వాసరావు ధైర్యం చెప్పి బుజ్జగించేవాడు.

వాసుతో అరుణపెండ్లి ఖాయమై ఆనెలలోనే ముహూర్తం నిశ్చయించారు. దినములు గడిచిపోతూన్నాయి. వివాహానికు యిహ నాలుగు దినాలుమాత్రమే గడువుంది. అరుణకు ఏమిచేయుటకును తోచుటలేదు. యిల్లంతా పచ్చనితోరణాలతోనూ, పెండ్లిపందిళ్ల తోనూ, క్రొత్తఅలంకారలతోనూ, పతిగారి ఔన్నత్యాన్ని సూచిస్తోంది. అరుణహృదయం కృష్ణునిరాకకోసం కొట్లాడేది. కాని అతనిరాకమాత్రం దుర్భరమైంది ఆమెకు.

మరో రెండుదినములలో వివాహం జరుగబోతూంది. ఆదినమే ఆమెను పెండ్లికూతురును చేయబోతే తనశరీరస్థితి ఆదినం బాగుండలేదని మారాంపెట్టి అప్రియత్నం ఆదినం జరుగకుండ ఉపసంహారింపచేసింది.

అప్పుడే కృష్ణునితోగల తన ప్రేమవిషయం తండ్రికి తెలియబరుస్తే యింతవరకు వచ్చియుండేదికాదేమో అని ఆమెమనసు పలుమారు అరచేది. కాని పెండ్లితలపెట్టి అది జరిగించినా లాభములేదనుకొంది. అనిమిషంలో తండ్రి తనజీవితప్రశ్నకంటే ఆత్మగౌరవాన్నే ఎక్కుడుగాతలచి తనపెండ్లి వాసుతోనే జరిగించితీరుతాడని స్థిరపరచుకొంది. ఆ నిశ్చయాలతో ఆమెమనసు వికలతచెంది కండ్లవెంట అశ్రుధారలు అప్రియత్నంగా జారాయి. తాను ఏమిచేయుడానికి దారిగానక మనసుఅంతా చెదరుత్తూంది. చెదరేహృదయఆందోళనకు తాళుకోలేక అరుణ నిర్జీవప్రతిమలా తయారై అన్నపానీయాలందు వహ్యాభావన్ని అగుపరుస్తూ ఆనాలుగుదినములతోనూ విచారంలోకుంగి శల్యమైంది.

ఆదినం రాత్రి పది దాటింది. ఆకాశంమీద నక్షత్రాలతో పందెంవేసుకొని పరుగెడుతూన్న చందమామ తన సహజకాంతులను

వెదజల్లుతూ ప్రపంచాన్నంతా పాలిస్తున్నాడు. ఆకాశమంతా మబ్బులు లేక నిర్మలంగా ఉండి స్టేజిమీది నటుని చమికీకోటుమీదిరాళ్లు దగదగలు నక్షత్రకాంతులు మిలమిలలాడుతూన్నాయి. అరుణకు ఆ రాత్రి నిద్ర పట్టనేలేదు. తెల్లవారితే మరి యొకదినం గడువుఉంది ఆమెవివాహానికి. అరుణ తనగదిలో నిద్రపట్టక పచారులుచేస్తూ, మేడమీది కిటికీదగ్గర నిలువబడీ ఆకాశంమీది చంద్రునివంక ఓనిమిషంచూచి, తన దృష్టి ఎదుట రోడ్డుమీదకు మరలింది. రోడ్డుప్రక్క గంగరావిచెట్టుక్రింద ఓ వ్యక్తినిలచి మేడవంకచూస్తూన్నట్టు అగుపించింది. ఆమె తనదృష్టిని అవ్యక్తిమీదనిలపి కేంద్రీకరించి చూడడంలో ఆతడు కృష్ణుడేమో అన్న ఆతృత ఆమె మనసును లాగుతూంటే అరుణ చట్టున వెనుతిరిగి మేడ మెట్లుదిగి రోడ్డుప్రక్కతోట ప్రహరి పిట్టగోడను ఒక్కపరుగుతో సమీపించింది. ఆ చీకటఛాయలోంచి తెల్లని బట్టలవిగ్రహం కదిలినట్టయి ఆగోడను సమీపించింది.

'కృష్ణా!—'

— 'అరుణా!!—'

'ఆ. నేనే. ఇటురా. ఆ గేటుతలుపుతీసుకొని లోనికిరా కృష్ణా'

'వద్దు. ఎవరైనచూస్తే—'

'చూడనియ్యి. యిహ భయపడను. నీవు యిప్పట్లో రావేమో నని ఈ నిమిషంవరకు దిగులుతో—'

'అరుణా—'

'ఉష్—లోనికిరండి. ఎవరులేరు మిమ్మల్నలగుర్తించడానికి—' అంటూ అరుణ అతని సమాధానం వినకుండానే గేటుదగ్గరకు పరుగెత్తి తలుపుతెరుస్తూ అతని ఆహ్వానించి లోనికితీసుకొనిపోయింది. మల్లెపందిర ప్రక్క పోకచెట్టునీడలో నిలువబడ్డారు అరుణా కృష్ణులు.

'అరుణా—నీపెండ్లి అని విన్నాను. ఆనందపడ్డాను. ఆఖరుమారు నిన్ను ఒక్కసారి కలుసుకొని ఈ గాజు బహుమతిగాయిచ్చి పోదామని వచ్చాను'

'ఇతరవ్యక్తితో నాపెండ్లి జరుగబోతోందిఅంటే నీకు ఆనందంగా ఉందా?—ఈమాటలు నాఎదుట మాట్లాడడం నీకు ధర్మమేనా?—పైగా ఈపెండ్లికి నీ బహుమతికూడనా?—'

'అరుణా!—నీ తండ్రిగౌరవాన్ని కాపాడడం నీ బాధ్యతఅయి ఉందని యింకనూ గుర్తించనేలేదా!—'

'ఇదిగో—త్రికరణశుద్ధిగా చెవుతూన్నాను విను. ఈలోకంలో అరుణ నీవస్తువు. ఈ శరీరం ఎప్పుడో నీవశంచేశాను. దీనిమీద సర్వ హక్కులూ నీవి—'

'అరుణా పిచ్చిదానివికాకు—'

'కాదు. కాదు—నిశ్చయముతోనే మాట్లాడుతూన్నాను. నా జీవితమే త్రుంచబడుతూంటే నాతండ్రి ఆత్మగౌరవంతో నాకేటిపని!—అదిగాక ఆతనితో పెండ్లిఒప్పుకోవడంఅంటే వ్యభిచారి కాక ఏమౌతుంది! ప్రజాదృష్టిలో పాతివ్రత్యమనే పేరుతో చెలామణిఅవుతూన్న ఆస్వైరంతర్యామి కండ్లనుమూసి పాపాన్ని బాపుకోలేనుగా—'

'అరుణా! ఆవేశంతో కర్తవ్యాన్ని మరుస్తున్నావు.'

'లేదు—నా జన్మఅంతా నీహస్తాలబిగువులో – నీ నవ్వుపెదవుల తళతళల్లో – నీ నల్లకండ్లనీడలో మైమరచి స్వర్గద్వారాలు తెరచుకొని విహరించాలి. అప్పుడుగాని నీ జీవితఫలితం—'

'అరుణా! రేపటి నీపెండ్లి—'

'నా పెండ్లి నీతోజరగాలి. లేదా అరుణ నీకుఅగుపడదు. అరుణ ప్రేమలతఅయి నీచుట్టు ఆతోట చెట్లబిగుళ్ళమీద—'

'దేవీ!—'

'మళ్ళీపిలుఅలా. కృష్ణా!—క్రొత్తపేర్లతో పిలుస్తూన్నావానన్ను ఎంతముద్దుగా—ఎంతహాయిగాఉంది ఆపిలుపు. ఆపిలుపుతో — కాదు — నీ ముద్దుమాటలో అమృతంఉంది. అదినామీద కురిపించు—' అంటూ అరుణ ఆతనివక్షానికి తనతలను అదుముతూ విడవలేనికాంక్షతో అతనిని అతుక్కొని బరువంతా అతనిపై మోపుతూ రెండువైపులా అతనికి తగిలే యౌవనబారంతో కంటనీరుజారుస్తూ అతనికండ్లలోనికిచూచింది. కృష్ణుడు ఆక్షణంలో యిహా ఆమెసుకాదన లేకపోయాడు. మెత్తని ఆమెమృదుశరీరపు బాగాలన్నీ అతనిని అదుముకొంటూంటే అతని ఎడమచేయి అప్రయత్నంగా ఆమెచుట్టివేసి దగ్గరగాలాక్కుంది. ఆ కౌగిలింతలో కండ్లుమూసుకొని ఓక్షణం అలానే నిలచిపోయారు. కృష్ణుడు ఓమారు కండ్లుతెరచి ఆమెవంకచూచాడు. అమూసిన ఆమె పెద్దకండ్ల అందం, పెదవుల ఎర్రిదనంలోని వంపులు, అతని పెదవులను పిలచి నట్టయి ఆమె పెదవులను తనపెదవులతో తాకాడు. అరుణ ఆస్పర్శతో కండ్లుతెరచి, తన ఎర్రిటికాశీగాజుల చేతిని అతని మెడచుట్టుతిప్పి అతని తలను దగ్గరకులాగుకొంటూ తనపెదవులను అతనిపెదవులకు అదుముతో అతని క్రింది పెదవిని జివ్వాకులిపించింది. ఆకలయికలో—ఆకౌగిలింతలో— ఆపెనవేసుకొనడంలో వారిహృదయాలు ఉపప్రపంచానికే దూరమై స్వర్గ సుఖాలలో ఈదులాడుతున్నాయి.

'అరుణా—ఏది నీచేయి యిటుతే—' అంటూ కృష్ణుడు ఆమె పచ్చనిచేతిని తనచేతిలోనికి తీసుకొని తాను తెచ్చిన బంగారుగాజుల్ని ఆమెచేతులకు తొడిగాడు. అరుణ అతనివక్షానికి చేరబడి కండ్లలో చనువునుచూపుతూ ఆమెకూడ అతనిచేతివేలికి తన చేతినున్న ఉంగరం తీసి ఉంచింది. ఆ ఉంగరపువ్రేలిచేతితోనే కృష్ణుడు ఆమెతలను నిమిరాడు.

'కృష్ణా—నీతోనే యిహ ముందుజీవితం గడవస్థిరపర్చుకొన్నాను నన్ను నీతో—'

'అరుణా—ప్రమాదమును నీవు కోరి తెచ్చుకొంటూన్నావేమో అనిపిస్తూంది—'

'ఆత్మగౌరవాలు—ప్రమాదాలు లెక్కించను నేను. నీప్రక్క నుండడమే నాకు కావలసింది—' అని అరుణ చెప్పుతూండగనే గుఱ్ఱపుసాలలోంచి మనిషివస్తూన్నఛాయ అగుపడింది. ఆతనిచేతిని చెంపకానించుకొని వేళ్లు లెక్కపెడుతూన్న ఆమె చట్టున తలత్రిప్పి వెనుకకుచూచింది. ఆమెనుచుట్టూ చుట్టుకొని కూర్చున్నవాడు ఆలాంతరువెలుగును చూడగనే మెల్లగా పడగవిచ్చిలేచే నాగసర్పంలా వెనుతిరిగి చూచాడు కృష్ణుడు. వెంకన్నచేతిలోని గుడ్డిదీపంతో ఆస్థలానికేవస్తూన్నట్టు అగుపడడంతోనే, కృష్ణుడు ఆమెమీదనుంచి తనచేతులను తీసివేస్తూ—

'అరుణ—యిహ నేను వెళతాను. రేపురాత్రికి ఈవేళకే నాతో వచ్చివేయుడానికి సిద్ధంగాఉండు'

'ఈ చోటునేఉంటాను. తప్పక రావాలి'

'తప్పకవస్తాను. నిన్ను తీసుకొనువెళ్ళు సులువుపర్పాట్లన్నీ సరిచేసుకొనేవస్తాను. భయపడకు—'

'మరవకండి. ఇహవెళ్ళండి. వాడు యిటేవస్తూన్నాడు'

'ఊ—నీవు మేడనుచేరుకో. నేను వెడతానుగా—' అంటూ కృష్ణుడు గోడదూకాడు. అరుణ దెబ్బతిన్న హరిణంలా లాంతరువెలుగుపంక బెదరుతూచూచి అక్కడనుంచి పరుగెత్తి మేడలోనికిపోయింది.

కృష్ణునిరాకను ముందుగనే గుర్తించిన వెంకన్న పరుగెత్తుకొనివెళ్ళి విశ్వాసరావుకి ఎరిగించడంచేత రావు పోలీసుయిన్సపెక్టరును సహాయంగా తీసుకొని కృష్ణుడ్ని పట్టించడానికి రాజబాటకు దగ్గరగనే ఆయనను నిలబడచేశాడు. తమరాకకోసం నియమితస్థానంలో వేచియున్న వెంకన్నకు

తమడునికిని తెలియపరుస్తూ కృష్ణుడు ఈవలకువచ్చునిమిత్తం ఆతనిని ఆతోట్రివను వెళ్ళవలసినదిగా పుత్తెంచాడు విశ్వాసరావు. వెంకన్నరాకతో కృష్ణుడు గోడదూకాడు. ఆదూకడంలో యిన్స్పెక్టరు ఆతనిచేతిని పట్టుకొన్నాడు.

'ఎవరునువ్వు—'

'నేనా?—'

'అవును. ఈరాత్రివేళ యీయింటిలోనికి ఎందుకు ప్రవేశించావ్'

'..................'

'దొంగవెధవా!—పద స్టేషనుకి—' అంటూ యిన్స్పెక్టరు ఆతనిని లాగుకొనిపోతూంటే విశ్వాసరావు చిరునవ్వుతో ఉదయంవచ్చి ఆయనను కలుసుకొంటాననీచెప్పి సెలవుతీసుకొని వెనుతిరిగిపోయాడు.

ఆరాత్రింతా కృష్ణునికి కారాగారవాసం అయింది. ఇన్స్పెక్టరు ప్రశ్నలకు నిజకారణంచెప్పి అరుణగౌరవానికి కళంకం ఆపాధించడం యిష్టములేక కృష్ణుడు నిరుత్తరుడై ఊరుకొనడంచేత యిన్స్పెక్టరు మరింత అనుమానించి ఆతనిని ఆరాత్రి లాకప్‌లో ఉంచాడు.

---

## 6

అమరుచటిదినమే వివాహముహూర్తనిర్ణయకాలం. ఆరాత్రి కృష్ణునితో వెళ్ళిపోవచ్చుననే నమ్మకతోకూడిన ఆనందంచేత అరుణలో పూర్వంఅగుపడిన చిరునవ్వులు తొణికిసలాడుతూంటే ఆమెనవ్వులు అక్కడివారినందరినీ ఉత్సాహపరచాయి. ఆదినం పట్టుదలగా పెండ్లి కూతుర్ని చేశారు అరుణను. అరుణ అదంతా ఆటగాతలుస్తూ శశిరేఖ వివాహాన్ని జ్ఞప్తికితెచ్చుకొని తనలోతానే ముసిముసినవ్వులు నవ్వు కొంటోంది.

అంతలో లెనగది అవతలహాలులో ఈసంభాషణ వినవస్తూంది అరుణకు.

'ఎప్పుడు!—'

'రాత్రి పదకొండున్నరకు'

'పట్టుపడ్డాడా?—'

'ఆ. మాయిన్స్పెక్టరుగారే స్వయంగా పట్టుకొన్నారండి వాడిని'

'వాడిదగ్గర ఏమైనావస్తువులు అగుపడ్డాయా?—'

'లేదు. పొడిఅక్షరాలు పేరుగాగల ఒకఉంగరం పద్దిరూపాయలు మాత్రం దొరకాయి. ఆ ఉంగరంలోని అక్షరాలు అతనిపేరుకి సరి పోలవు'

'ఇప్పుడు వాడు ఎక్కడ!'

'చెరసాలలో'

'దొంగవెధవ. ఎందుకువచ్చినట్లు చెప్పాడు ఆరాత్రివేళ'

'దొంగఎత్తువేసి నిరుత్తరుడై ఏప్రశ్నకు సమాధానంచెప్పకుండ ఊరుకొన్నాడు'

'అసలు యిన్స్పెక్టరు ఆవేళలో మనయింటిచాయల్లో ఉండడం ఎలాతటస్థమైంది!—'

'మన వెంకన్న లేడూ!—వాడు ఆదొంగవెధవరాకను గుర్తించి పోలీసుస్టేషనులో రిపోర్టుచేశాడట. దానితో—'

'మంచిపనిచేశాడు. ఆదొంగ మనఊరువాడేనా?—'

'ఏమో—ఆరాత్రివేళలో గుర్తుపట్టలేదు—' అని విశ్వాసరావు పతిగారికి తెలియబరుస్తూ ముందుహాలులోనికి నడచిపోవడంచేత అరుణకు తక్కినమాటలు వినబడలేదు. ఆపట్టుబడినవాడు కృష్ణుడే అని గ్రహించు కొన్నప్పుడు అరుణహృదయంలో ఆరనిఅగ్ని రగుల్కొని, రక్తం గుండె నుంచి ఒకేసారి తలకెక్కింది. భీతితో కనుబొమలు విశాలమై రెప్పలు

వాటంత అవే పెద్దవిగా తెరచుకొన్నాయి. మూతలువడని కనురెప్పల కొనకల్లోంచి అశ్రుధారలు శిఖరాలనుంచి ప్రవహించే చెలవేరుల్లాగు ఆమె నున్ననిగులాబిరేకుల్లాంటి బుగ్గలమీదకు జారుతూన్నాయి. ఇహ ఆస్థలంలో నిలువలేక చట్టున వెనుతిరిగి మంచంమీదకు ఒరిగి, పందెంలో సర్వఆస్తినీ ోలుపోయి దిక్కుగానక ఉపాయరహితుడై అలమటించిపోయే అనాధుడులా అరుణ తనదుఃఖాన్ని ఆపలేక తలగడలో తలనుదూర్చి వెక్కి-వెక్కి ఏడుస్తూంది.

అంతలో వాసు ఆమెను తనతో క్రొత్తగురాల బండిమీద షికారుకు తీసుకొనపోదలచి ఆగదిలోనికివచ్చాడు. అతనిరాకను గుర్తించని అరుణ అంతకంతకు దుఃఖాన్ని యిముడ్చుకొనలేక మరింత స్థితిని హెచ్చించి వెక్కుతూ ఏడుస్తూంది. ఆమె దుఃఖానికి కారణం తెలుసుకొనలేక వాసు దిగ్భ్రమముతో అక్కడనే ఓక్షణం నిలచిపోయాడు.

'అరుణా!—' అని వాసు నెమ్మదిగా పిలచినప్పుడు అరుణ చలించక నెమ్మదిగా తలఎత్తి ఆతనివంక చూచింది.

'ఏడుస్తూన్నావా?—నీకు కూడ దుఃఖమునేదిఉందా?—చూడూ నీదుఃఖానికి కారణం నాతో చెప్పవ్—'

'...............'

'అరుణా!—చెప్పకూడదా నాతో. నీసుఖదుఃఖాలను వంచుకొనబోయే నీవానుకి చెప్పలేవా?—'

'మీరువెళ్ళండి. ఇప్పుడు నన్ను ఏమీప్రశ్నించవద్దు'

'అరుణా!—నన్నే వెళ్ళమంటూన్నావా? నీకష్టాన్ని నాకు తెలియజేయు నీహృదయం ఒప్పుకోవడంలేదా?—'

'దయఉంచి మీరు వెళ్ళండి. నాదుఃఖకారణం ఎవరూ తెలుసుకొనదగిందికాదు. నాతెలివితక్కువే నాదుఃఖానికి హేతువైంది. నా మంచిచెడ్డ గణితములే నన్ను చుట్టవేసిన విషసర్పమైయింది—'

'అరుణా—నీమాటలు నాకు అర్థంకావడంలేదు'

'క్షమించండి. నన్ను ఓక్షణం మాట్లాడించక—' అని ఏమో చెప్పబోతూ ఉబికివచ్చే దుఃఖాన్ని ఆపుచేసుకొనలేక తలగడలో మరల తలనుదూర్చి ఏడవడం మొదలెట్టింది.

వాసు నెమ్మదిగా ఆమెను సమీపించి, సముద్రపుటంచులమీద యిసుకలో అగుపడే అలలచాయలులా మిట్టపల్లములుతేరే ఆమెరేగిన మెలితిరిగిన నల్లతలవెంట్రుకలను సరిచేస్తూ—

'అరుణా—ఏడవకు. నీదుఃఖాన్ని నాగుండె భరించలేకపోతోంది. నన్ను నీచంగా తలచి వేరుపరచుకు. నీకోసం ఎంతటికష్టాన్నయినా ఎదుర్కొని నీదుఃఖం ఉపశయింపచేయడానికి అన్నివిధములా ప్రయిత్నిస్తాను' అని నెమ్మదిగా హృదయమంతటితోనూ వాసు అంటూంటే అరుణ ఆతనివంక చూచింది. ఆచూపులో ఆశ తలఎత్తింది. ఆచూపులో ఆతనిని ఎదో అర్థించినట్లగుపడింది.

'అరుణా!—ఇంకా సంశయిస్తూనేఉన్నావా?—చెప్పు నీదుఃఖం ఉపశయింపచేయడానికి ఎంతటిభయంకర ఆపదనైనా ఎదిరించదలచాను'

'వాసూ!—నాకు సహాయముచేయగలవా?—'

'ఆ. తప్పకచేస్తాను. నీవిచారం అరికట్టగలడానికి సహాయమే కాదు ఏత్యాగమైనా చేస్తాను' అని వాసు ధీమాగా అంటూంటే అరుణ నెమ్మదిగా లేచికూర్చుంది.

'వాసూ!— నావల్ల అపచారంజరిగింది. నా ప్రేమనుగూర్చి నాతండ్రికి మొదటలోనేచెప్పు సాహసములేకపోవడంచేత యింతవరకు తెచ్చుకొన్నాను'

'అంటే!—'

'అంటేనా?—వినండి. నేను ఓమాటు మానాన్నగారితో సిస్తుల వసూళ్ళకై కేంపుకువెళ్ళినప్పుడు ఆనందపురనివాసియగు కృష్ణుడు అనే

అతనితో నాకు పరిచయంఏర్పడింది. ఆపరిచయమే క్రమంగా స్నేహంగా ప్రేమగా కూడ మారింది. ఆతనితోనే ఆటోటల్లో కాలాన్ని దొర్లించే దాన్ని. చివరకు మాసంభంధం అల్లరిఅయి కిట్టనివాళ్లు యిది కారణంగా తీసుకొని నలుగురిలో మానాన్నను అగౌరవపరచదలచగా ఆకృష్ణుడు మా గౌరవం కాపాడానికి నన్ను సోదరిభావంతో నన్ను ప్రేమిస్తూన్నాననీ వేరు భావంకాదని వారందరిముందర నిస్సంసయంగా చెప్పివేశాడు. ఆమాట వల్ల అప్పట్లో అతనిమీదనే నాకు ప్రేమగలదని మానాన్నగారికి చెప్ప లేకపోయాను చెప్పినా అంతఅల్లరికి గురిఅయిన అయనతో నావివాహా నికి నాన్నగారు ఒప్పుకొనరేమోఅనే సంశయంతో యింతకాలం ఆ రహస్యాన్ని దాచిఉంచాను. చివరకు మీతో పెండ్లి ఖాయపర్చి వివాహముహూర్తం నిశ్చయింపబడడంచేత్త, నావలపుసంగతి ధైర్యంగా మానాన్నగారికి తెలియజేసే ధైర్యంలేక కృష్ణునితో లేచిపోవడానికే నిశ్చయించి క్రిందటిరాత్రి అతనిని యిక్కడికిరప్పించాను. నారాకకు మొదటలో అయన ఒప్పుకొనకపోయినా, చివరకు అయనను ఒప్పించి 'ఊ' అనిపించాను. ఇంతలో మాయింటిలోపనిచేయు వెంకన్న పోలీసు వారికి ఈసంగతి ఎరుకపరచి కృష్ణుడ్ని దొంగగా నిరూపించి చెరసాల పరంచేశారు'

'దొంగనుకాదని అయనచెప్పలేదా?'

'మాగౌరవం కాపాడడాని కేసమాధానంచెప్పక ఊరుకొన్నారు. అందుచేతనే కారాగారప్రాప్తి'

'అమ్మాయి!—నీకు యిష్టతలేనిపెండ్లి నేనుమాత్రం చేసు కొంటానా!—నీకు అతనితోనే వివాహం జరిగించడానికి ప్రయిత్నిస్తాను' అని వాసు ఆమెకు అభయాన్నియిచ్చి ఓదారుస్తూంటే వెంకన్న అక్కడా నికి వచ్చాడు.

'బాబూ—మామగారు తమరిని దయచేయమంటూన్నారండి'

'యిటురా—'

'ఏం! బాబూ—'

'రాత్రి దొంగను పట్టించావా?—' అని వాసు అడుగుతూంటే వెంకన్న తడబడుతూ వెర్రిచూపులు చూస్తూ సమాధానం యివ్వలేదు. వాడు అలా బెదురుతూ తడబడుతూ కారణంగానక నిజసంగతి చెప్పడానికి వాడు ఎందుకు తడబడుతున్నాడా అని అతనివంక తీక్షణంగా చూచాడు వాసు.

'ఏమిరా మాట్లాడవు. జరిగినది చెప్పడానికేం!— దొంగ ఇంటిలో పడినప్పుడు దగ్గరగా ఉన్న యింటి ఎజమానికి తెలుపకుండ పోలీసువారికి తెలియచేయడం ఎందుకు జరిగింది!'

'చిత్తం. ఆరు పోలీసులు కాబట్టి పట్టితీస్కుకెళతారని వారికి చెప్పానండి అయ్యా'

'ఊ—సరే. దొంగను పట్టి పోలీసువారు తీసుకొనివెళ్ళినతరువాతనైనా ఈసంగతి పతిగారికి ఆరాత్రి తెలియబర్చావా?'

'..................'

'ఇదేదో మోసం ఉంది. చెప్పవేం!—ఎందుకు అలాభీతిగా చూస్తావ్. ఊ—చెప్పు'

'అయ్యా!—విశ్వాసరావుబాబయ్యగారే అలా చేయమన్నారండి'

'ఆసమయంలో ఈసంగతి విశ్వాసరావుగారికి ఎలా తెలును—' అని వాసు నిలదీసి వెంకన్నను అరుణ ఎదుటనే అడుగుతూంటే పతిగారుకూడ ఆగదిలోనికి వచ్చారు. పతిగారిరాకతో వెంకన్న మరింత వణకుతూ బెదరుచూపులుచూస్తూన్నాడు. వాడు కంగారును గమనించిన వాసు ఏదో మోసంఉండి ఉంటుందనే నిశ్చయానికివచ్చి వాడిమీద ప్రశ్నలవర్షం కురిపిస్తూన్నాడు.

'అయ్యగారింటికి వెళ్ళి చెప్పానండి. ఆయనే ఇన్స్పెక్టరుగారిని తీసుకొనివచ్చి ఆఅబ్బాయిగారిని పట్టించారండి'

'నీవు పోలీసువారికి చెప్పలేదన్నమాట'

'లేదండి బాబయ్యా. కనికరించాలి కామందులు'

'ఫరవాలేదు. ఇంటిలో ఉన్న పతిగారికి తెలుపకుండ దూరంలో ఉన్న విశ్వాసరావుకి ఎందుకు ఎరింగించబయలుదేరావ్'

'చిత్తం. మీపెండ్లి అరుణమ్మగారితో జరగాలనే ప్రయిత్నం కోసం వారేచేశారండి ఈపనులన్నీ—'

'ఏపనులు! సరిగాచెప్పు. భయపడకు. నిన్ను క్షమిస్తానులే'.

'చిత్తం. నమస్కారాలండి బాబయ్యా. నిజంచెప్పేస్తాను. ఆచిన్న అయ్యగారితో అరుణమ్మ ఆతోటవెంట తిరుగుతుందని విశ్వాసరావు గారికి తెలిసి, అతనినే అరుణమ్మ ఎక్కడ పెండ్లిచేసుకొంటుందో అని ఆనందపురంలో అయ్యగారిని అల్లరిపెట్టించింది విశ్వాసరావుగారేనండి. ఆకరణంగారికి లంచమిచ్చి ఆ అల్లరిపెట్టించారండి. దానితో ఆకుర్రాడిని చేసుకొంటానని అరుణమ్మ చెప్పలేదని ఆబాబుగారి ఉద్దేశమండి. అలానే జరిగిందికూడాను. ఆకృష్ణుడు ఈకుట్రతప్పక వస్తాడని నన్ను హెచ్చరించి, ఆఅబ్బాయిడస్తే తనకు తెలియచేయమన్నారండి. అందు చేతనే ఆయనకు చెప్పానండి. అరుణమ్మగారిని మీకిచ్చి పెండ్లిచేయు డానికే ఆయన ప్రయత్నమంతాను. ఆపెండ్లితో ఈఆస్తికంతా మీరు ఎజమానులుకాడానికే ఆబాబుగారి ఉద్దేశమంతానండి—' అని చెప్పి ఊరుకొన్నాడు వెంకన్న. పతిగారికి పూర్తివిషయం తెలిసి విశ్వాసరావు కుట్రకు ఆశ్చర్యపడ్డాను.

'పతిగారూ!—క్షమించండి. మీ మామ తరఫున నేను క్షమాపణ వేడుతూన్నాను మిమ్ములను. స్వార్థంకోసం చేసింది మిమ్ములమాయ

చేసి నాకు అరుణతో వివాహంకూర్చాడు మామామగారు. ఆకృష్ణుణ్ణే అరుణ ప్రేమించింది. కృష్ణుడు మంచివాడని తెలుసుకోనడానికి మీ గౌరవంకోసం తన ఆత్మగౌరవాన్ని విడచి చెరసాలలో ఉండడమే సాక్షి. ఆయనతోనే అరుణ వివాహాన్ని జరుపండి—' అని వాసు చెపుతూంటే ఆతని విశాలహృదయానికి అరుణ ఆశ్చర్యపడుతూ కండ్లవెంట ఆనంద భాష్పాలను విడచింది. విషాదబిందువులే ఆనందభాష్పాలుగా మారాయి అరుణనేత్రాల్లో అనిమిషాన్ని.

అధికగౌరవాలతో కృష్ణుణ్ని చెరసాలనుంచి కొనితేబడి అరుణతో ఆతని వివాహం జరిపించారు పతిగారు. వాసు త్యాగానికి కృష్ణుడు కృతజ్ఞతలు అర్పించి ఆ యిస్టేటుకు వాసునే తన ప్రివేటుశక్రటరిగా ఏర్పరచుకొన్నాడు కృష్ణుడు. ఇప్పుడు వాసూకృష్ణులు ఒక్కకడుపున జన్మించిన సోదరులుగానే ప్రవర్తిస్తూ ఒక్కనిమిషమైనా ఒకరినొకరు విడచిఉండలేని స్థితికివచ్చారు. ఇస్టేటురాబడిని ఖర్చుచేయడంలోగాని కూడికచేయుడంలోగాని వాసుఇష్టంమీదనే నడుస్తోంది. వాసు అరుణను సోదరిలా చూచుకొంటూ చనువుగా ఆఇంటిలో తిరుగుతూన్నాడు.

ఇంతకీ చివరమాట ఏమిటంటే వాసేకృష్ణుడు, కృష్ణుడే వాసుగా ఉన్నారు ఆయింటిలో.



## రాబోవు క్రొత్త నవలలు

1 పాషాణము

2 పౌర్ణమి

### జీవితచరిత్రలు.

1 రాజగోపాలాచారి

2 అజాద్

3 చిత్తరంజన్ దాస్

4 పటేలు బ్రదర్సు

5 నవాబ్ జిన్నా

వలయువారు:—

పసుపులేటి బాపిరాజు

రాజమండ్రి.